# LET ME CONFESS

Pasupuleti Purna Chandra Rao

*An Anthology of Poems*

First Edition Septemper, 2002



Cover Design :
Pasupuleti Purna Chandra Rao

*For Copies :*
Visalandhra Book House, Bank Street, Hyderabas & other Branches.
Navodaya Publishers, Karl Marx Road, Vijayawada.
Navodaya Book House, Kachiguda, Hyderabad., and

ELMA BOOKS C/o Ethnic Arts Centre,
Plot No. 88, Jyothi Mansion-201, Snehapuri Colony,
Nacharam, Hyderabad - 500 076.
Ph : 7158724
E-mail : ifhd@hd1.vsnl.net.in

*Printed at :*

**Sri Sri Printers,**
VIJAYAWADA - 520 002.
Ph : 0866 - 571359.

Price : Rs. 75/-

నా కలాన్ని.... కలల్నీ కదిలించిన
ఇద్దరికి -
పూజ్యులు ' **పరాభి** ' కి....
ప్రియమైన 'ఉ' కి....

# లెట్ మి కన్ఫెస్

అన్నీ..... ఒక్కొక్కటీ.....


| | | |
|---|---|---|
| I | Forward - పఠాభి | 7 |
| II | సెల్ఫ్ ఇంట్రో | 8 |
| 1 | అగ్గిపుల్ల.... పిచ్చి పిల్ల....! | 13 |
| 2 | మగ మీమాంస | 15 |
| 3 | కన్నమ్మా....! | 17 |
| 4 | పెళ్లి.... గిళ్లి....! | 19 |
| 5 | సౌందర్యం కోసం | 21 |
| 6 | మానుషి-మాస్క్ | 23 |
| 7 | మాయా దర్పణం | 29 |
| 8 | టేకాఫ్ | 32 |
| 9 | ప్రతి పాదం పరమ పంకిలమే కదా....! | 35 |
| 10 | మీ టూ ఏ బల్తజార్ | 37 |
| 11 | నా ముంబాయీ బాయీ....! | 40 |
| 12 | బెర్గ్‌మన్ గారి భార దుర్భర 'నిశ్శబ్ద' గీతం | 42 |
| 13 | స్ఫింక్స్ | 45 |
| 14 | యుద్ధమే పరమార్థం | 49 |
| 15 | ఏబ్‌స్ట్రాక్ట్ ఆడది | 51 |
| 16 | ఇసుకసమాధి | 53 |
| 17 | పెన్సిలేన్ 'రెవరీ' | 60 |
| 18 | ఛినమస్తాదేవి | 66 |
| 19 | అసంపూర్ణ గీతమే కానీ....! | 69 |
| 20 | కామగానం | 71 |
| 21 | గ్రేట్ కన్‌ఫెషన్స్ ఆఫ్ వైల్డ్ గేమ్స్ | 74 |
| 22 | కాట్‌గాళ్ | 82 |
| 23 | కుయ్..! కుయ్..! | 84 |

24 గొంతులో పొడిచినా.....! 86
25 'జొకాస్టా'తీతం 88
26 ఇన్‌ఫెంట్ హామ్లెట్ 89
27 సెవనియర్ ఇచ్ 91
28 మనం రాహువులం గాకపోతే.. కేతువులం లేవోయ్...! 96
29 ఎన్ ఎవర్ ఏలియనేటెడ్ మెలోడ్రామా (అను) ఓ భేతాళ త్రయోదశిక...! 102
30 బర్త్ ఆఫ్ వీనస్ 106
31 శ్వేతానందం 109
32 రెక్కల బాధ రెక్కలిది...! 112
33 క్షతగాత్ర సమాధానం 114
34 అర్థాశ్వమేధం 116
35 రాతిమనిషినే కానీ...! 119
36 హలో..! హోలా...! 121
37 గుర్రాలకే తెలుసు గుస గుసలు....! 123
38 ప్రకృతి - పురుషుడు 125
39 సానుభూతి సారాంశం 127
40 'సాదె' 130
41 మహాయోగిని 132
42 థాంక్యూ 'క్లిమిట్' 136
43 ఒంచడానికి ఒంగితే చాలనుకుంటాం.... కానీ! 138
44 ఏడుగురందగత్తెల ప్రియుడు 141
45 పురుషాద్వైతం 150
46 తీగలెప్పుడూ చుట్టుకుంటాయిలే గానీ...! 152
47 బాధ బాధే...! 155
48 హెచ్చవేతలు.... తీసివేతలు 157
49 మహా శక్తి 159
50 మధుర స్మృతి 162

III ఉన్నమాట - ఉలికిపాటు ! - 'మో' 167

# FOREWORD

Congratulations to Purna Chandra Rao who is a theatre activist working with the dalits and tribals, and who has now come out with a sheaf of poems that are bound to cause a stir in Telugu literary circles.

Though not an avowed poet, he must have harboured these sentiments in his inner most heart. We are now fortunate that he has revealed them in his book, "Let Me Confess".

I read the poems with much enjoyment and excitement, as they are very different from the usual run of poems. They have a different vocabulary, rhythm and diction.

I specially appreciated the love poems. They have a modernity of mood and music.

Man-Woman relationship has been explored and recorded with psychological subtlety and brutal honesty. This is rather unique to these poems and a definite contribution to this genre.

I wish the author all successs for any further confessions.

Pattabhi

( T. Pattabhi Rama Reddy )

# సెల్ఫ్ ఇంట్రో

ఏ సమాజ ఉద్ధరణ కోసంవూ నేనీ పొయిట్రీ రాయలేదు. నా ఆనందం కోసం, నాలో నేను నవ్వుకోవడం కోసం, నాలో నే జూసుకోని, నా వంకరల మీద జోక్ చేసుకోవడం కోసం, అంతకన్నా ముఖ్యంగా నా స్త్రీ (ల) ని నేను తలచుకోవడం కోసం అప్పుడప్పుడూ తోచినప్పుడల్లా ఇరవై ఏళ్ళుగా ఈ "కన్ఫెషన్స్" చేస్తూ వచ్చాను. నిజానికివి నా డైరీలో పేజీల్లాంటివి.

నా అనుభవాల్ని, ఆలోచనల్ని - వాటిల్లోంచి వచ్చిన కాస్తోకూస్తో తాత్వికతని నలుగుర్తో షేర్ చేసుకోవాలన్న ఆసక్తితో ముందుకొస్తున్నాను కానీ, ఆర్డరాఫ్ ది డేగా 'మంచి' పొయిట్రీ లక్షణాలేవీ నా 'కన్ఫెషన్స్' లో కనపడవు కనుక, చాలామంది 'మంచి' వాళ్ళకివి 'యాంటై పొయిట్రీ' అవుతాయనుకొంటున్నాను. ఖానివ్వండి...! నావరకు నాకైతే నేరాసింది ఘాటైన లవ్ పొయిట్రీ అనుకొంటున్నాను. నిజానికి చాలామేరకు నా కవితలు కథలు... పొయిటిక్ లవ్ స్టోరీస్...!

స్త్రీ పురుష సంబంధాలు ఒకవేళ నా పొయిట్రీలో ప్రధాన వస్తువుగా కనబడితేనో, లేదా మగ హిపోక్రసీ పట్ల... ముందు నా హిపోక్రసీ పట్ల నేజేసింది నవ్వులాటగా కనబడితేనో, ఆమాత్రానికి దీన్నేదో ప్రో-విమెన్ పొయిట్రీ అనుకోవాల్సిన పని లేదు.

ఆఫ్టరాల్, నేను మగవాడ్ని ; లభించే అనేక ఎడ్వాంటేజన్‌ని అందుకొంటున్న వాడ్ని; స్త్రీలు ఖచ్చితంగా విక్టమ్సే అని గ్రహించినా కూడా, ప్రాక్టికల్‌గా స్త్రీ శ్రమని దోచడంలో పురుష భూస్వామ్య లక్షణాల్ని పూర్తిగా వొదులుకోని వాడ్ని - ఎలా అబద్దం చెప్పను...? ఎడ్వాంటేజన్‌కి అలవాటుపడ్డ ప్రాణం కదా...! అంత తేలిగ్గా పురుషావకాశాల్ని వొదులుకొంటానా...?

కానీ నిజం కూడా ఒహటుంది. మరెందుకోగానీ నాకు స్త్రీల పట్ల గొప్ప ప్రేమే కాక, కాస్తంత భక్తి కూడా తగలడింది....! ఇది ఒకవేళ కాస్తంత 'సంస్కారం' గనక అయితే గియితే, స్పష్టంగా అది నా స్త్రీ (లు) నన్ను కాల్చిన కాల్చుడు వల్లనే కాబోలు...! పురుషుడికి తన స్త్రీ, తన భార్యా ఇద్దరూ ఒక్కరే కావాలన్న రూలేంవీ లేదని స్త్రీలకు చెప్పాల్సిన పనేంవీ లేదుగానీ, నిజం అంత తేలిగ్గా ఒప్పుకొనే అలవాటులేని 'మంచి' పురుషులకు గుర్తు చేస్తున్నానంతే...!

ఎక్స్‌ట్రా మారీటల్ రిలేషన్‌షిప్స్ స్త్రీలకైనా, పురుషులకైనా ఓ సత్యం అయినప్పుడు, అది మాత్రం ఓ సాహిత్య వస్తువు ఎందుకు కాకూడదు! ఈ వస్తువుపట్ల నీతి వాక్యాలు

పలకడమో, అసలీ వస్తువే లేదని గప్ చిప్‌గా వుండి పోవడమో, లేదా ఒక కోణం నుంచే చూడ్డమో, చూపించడమో చేస్తున్న ఆత్మవంచనా లోకంలో మనమున్నప్పుడు ఇక ఈ వస్తువుకి దాని ఫుల్ రేంజ్ ఆఫ్ కాంప్లెక్సిటీ తో సాహిత్యయోగం కలిగే అవకాశాలే తక్కువ కదా!

నరాలు జివ్వున లాగే గొప్ప అనుభవాన్ని స్త్రీ మనకిచ్చినప్పుడు, ఆ అనుభవం తర్వాతి అనుభూతిని హాయిగా నెమరవేసుకోని అమరత్వం పొందే ఆ కాన్షస్‌నెస్‌ని అద్భుతంగా చెప్పగలిగితే, అది సాహిత్యం ఎందుక్కాదు...?

'నీ వల్ల నేను సుఖపడ్డాను...' అనిపించుకొన్న పురుషుడు ధన్యుడు కాడా! ఈ పరస్పర సుఖం సాధ్యం అంటూ అయితే, ఆ అనుభవం వెనుక ఏ రకమైన జీవన తత్వం వున్నా అది మధురమైందే కదా...?

ఓ మధురమైన జీవన తత్వం నా జీవితాన్ని నిరంతరం నిర్దేశించింది. అది చాలా ఆధునికమైంది. చాలా సనాతనమైంది కూడా. నాకు నచ్చిన ఆ మధురమైన జీవనతత్వం గురించి నా కవితల్లో చెప్పడానికి కొద్దిపాటి ప్రయత్నం చేశాను.

స్త్రీ పురుషులిద్దరికీ మధురమైన జీవనతత్వం ఏదీ కేవలం పురుషుడు గీసిన గీట్ల మధ్యనే అంటే అది సాధ్యంకాని పని. గీటు దాటక తప్పదు స్త్రీకైనా, పురుషుడికైనా...!

అఫ్‌కోర్స్, తనకనుగుణంగా పురుషుడెప్పుడూ గీటుదాటుతూనే వుంటాడు. కానీ స్త్రీకనుగుణంగా దాటగలగాలి. తన స్త్రీ కనుగుణంగా దాటగలగాలి. అలా దాటగలిగితే పురుషుడు కూడా బలహీనుడౌతాడు- పురుష స్వామ్యంలో! అనేక మానసిక వికారాలకు గురౌతాడు. కానీ, కంఠానికడ్డుపడ్డ ఆ సామాజిక గరళాన్ని మింగగలిగినవాడు తాత్వికంగా పరమశివుడౌతాడు. తాంత్రిక సిద్ధాంత పరంగా సామాజిక, మానసిక గీట్లు దాటి స్త్రీ శక్తిగా మారాలి; పురుషుడు పరమశివుడిగా...! 'తావో' సిద్ధాంతం చెప్పే 'ఇన్-యాంగ్' తత్వం కూడా మౌలికంగా ఇదే...!

ఈ శివ-శక్తి తత్వాన్ని కేవలం మానసికంగా మసిబూసి మారేడుకాయజేసే పౌరాణికపరమైన దొంగ సిద్ధాంతం కూడా ప్రాచుర్యంలో వుంది. నిజానికి శివ-శక్తి తత్వం భౌతికమైంది; ప్రాకృతమైంది; ఇహమైనది; ఆనందదాయకమైనది. పురుషస్వామ్యపరమైన దాంపత్య శిథిలాల్లో మాత్రం అసాధ్యమైనది.

పురుషాహంకార సామాజిక మానసిక పరిస్థితుల వల్ల సనాతనమైన ఈ శివ-శక్తి తత్వం సమతూకాన్ని కోల్పోయింది. జీవనం గందరగోళంలో పడింది. ఈ గందరగోళం స్త్రీకి గరళం అవుతుంది కనుక, ముందు గీటు దాటాల్సిన అవసరం స్త్రీదే! తప్పదు. తిరిగి సమతూకాన్ని సాధించాలంటే, తమ సామాజిక సౌలభ్యాన్ని దాటి పురుషులు ఒక్కొక్కరుగా

గరళాన్ని దిగమింగి పరమశివులుగా మారాలి. పురుషాహంకారాన్ని 'కాస్ట్రేట్' చేసుకోని, శక్తి స్వరూపిణికి తన్నుతాను సమర్పించుకోవాలి. తిరిగి పరమశివుడిగా పునర్జన్మని పొందాలి. అప్పుడుగానీ శివ-శక్తుల ఆనందనృత్యం సాధ్యంకాదు.

ఈ సమతూకాన్ని తాత్వికంగా అర్ధంచేసుకొన్నా, సామాజికంగా అర్ధంజేసుకొన్నా, లైంగికంగా అర్ధంజేసుకొన్నా స్త్రీని అనుసరించాల్సింది పురుషుడేగానీ, పురుషుడ్ని స్త్రీ కాదు. క్షేత్రాన్ని బీజం అనుసరించాల్సిందే తప్ప, బీజాన్ని క్షేత్రం కాదు.

ఇంత కాంప్లెక్సిటీ వుంది కదా స్త్రీ పురుష సంబంధాల్లో...! ఈ కాంప్లెక్సిటీని పిసరంత తాత్వికతతో వ్యక్తం చేయడానికి ప్రయత్నించాను నా 'కన్ఫెషన్స్'లో. నిజంగా పిసరంత మాత్రమే తాత్వికతని వ్యక్తం చేయగలిగాను. చాలామేరకు గరళం మింగలేని నా ఇబ్బందిని, పరమశివుడ్ని కాలేక ఇంకా పరమ పశువుగానే మిగిలిపోయిన నా నిజాన్నీ కూడా వ్యక్తం చేశాను నా 'కన్ఫెషన్స్' లో.

నా 'కన్ఫెషన్స్' లో 'కన్నమ్మ' అన్న రికరింగ్ మోటిఫ్‌గా నా స్త్రీ కనపడుతూ వుంటుంది. ఈ కన్నమ్మ-కాన్సెప్ట్ నా జీవితంలో భౌతికంగా ఎంత సత్యమో, తాత్వికంగానూ అంతే సత్యం! కానీ ఒక్కోసారి అందుకోలేని సత్యం...!

ఈ 'కన్నమ్మ' తో పాటు, 'ఎల్లమ్మ' అన్న మరో కాన్సెప్ట్ కూడా ఓ సబ్‌థీమ్‌గా నా 'కన్ఫెషన్స్' లో అస్పష్టంగా కనపడుతూ వుంటుంది.

ఈ 'ఎల్లమ్మ' ని బడుగు జీవుల 'తక్కువ స్థాయి' దేవతగా గుర్తించినా, నాకభ్యంతరం లేదు. ఏ సిగ్గూ పడకుండా నేనా 'బడుగు దేవత' భక్తుడ్నే...!

ప్రపంచంలోని సనాతన మాతృస్వామ్య దేవతామూర్తుల తత్వం అంతా నా ఎల్లమ్మ తల్లిలో మూర్తీభవించి వుంది. పేరడాక్స్ ఏమిటంటే, అత్యాధునికమైన బొహీమియన్ స్త్రీ పురుష సంబందాల్ని గురించి ఫస్ట్ పర్సన్లో నే చెబుతూవున్నా, మరోవైపు నేను అట్టడుగు మాతృస్వామ్యమూర్తుల కధాగానం చేసే 'బార్డ్'ని కూడా...! నాలోని 'బార్డ్'ని - నేనింకా పబ్లిష్ చేయని - నా ఇంగ్లీష్ నాటకాల్లో, సాంప్రదాయిక సంగీతపరంగా రాసిన 'ఎలమదాసు కీర్తనల్లో' ఎక్కువగా వ్యక్తం చేసినా, ఈ 'కన్ఫెషన్స్' లో కూడా అస్పష్టంగా వ్యక్తంగాక పోలేదు.

ఆధునిక జీవితంలో తప్పనిసరిగా కనిపించే 'సింగిల్ విమెన్' నా దృష్టిలో భవిష్యత్ స్త్రీ పురుష సంబంధాల్ని నిర్దేశించే తాత్విక ప్రాతిపదికలు - వాళ్ళు ఆల్‌రెడీ ప్రస్తుత స్త్రీ పురుష సంబాధాల్ని ఛాలెంజ్ చేసిన ప్రశ్నార్ధకాలు కూడా కనుక...! వీళ్ళు జీవన తత్వం అర్ధమై అడుగు దాటినా, అర్ధంగాకనే దాటినా; పురుష సమాజంలో జీవితాల్ని కాంప్లికేట్ చేసుకున్నా; నిరసనలకి గురైనా, ఆత్మ న్యూనతకి బలైనా, ఏది ఏమైనా ఈ సింగిల్

విమెన్ జీవితాల్లోని కాంప్లెక్సిటీని అధ్యయనం చేయకుండా ఏ పురుషుడూ మానసిక వికాసాన్ని సాధించలేడు.

ఈ కాంప్లెక్స్ స్త్రీలే నా 'కన్ఫెషన్స్' నిండా నా కన్నమ్మలు, నా ఎల్లమ్మలు...!

ఈ సింగిల్ విమెన్ సంతానం - ముఖ్యంగా మగ సంతానం - మరింత కాంప్లెక్స్ జీవులు. ఈ పసిప్రాణుల్ని చూస్తే నా ప్రాణం గిలగిల్లాడుతూ వుంటుంది.

'బ్రాట్ ట్రిలెజీ' పేరుతో రాసిన ఓ పద్య త్రయం లో ఈ పసివాళ్ళ ప్రపంచంలోకి ప్రవేశించడానికి కొద్దిపాటి ప్రయత్నం చేశాను. మరో రెండు పోయమ్స్‌లో కూడా వీళ్ళు కనబడతారు.

పురుష దృక్కోణంలో ఈ కాంప్లెక్స్ స్త్రీలు ఒక్కోసారి సోకాల్డ్ 'బూతు' కి ప్రాతిపదికలు - కనుక - వీళ్ళని ప్రస్తావించిన నా 'కన్ఫెషన్స్' కూడా పైకి కాస్తంత బూతుగానే కనబడినా, నిజానికి ప్రతి కన్నమ్మా నాకో ప్రియురాలే కాకుండా, నాకో మాతృ దేవత కూడా!

స్త్రీని కన్నమ్మగా ప్రేమించాలన్నా, ఎల్లమ్మగా పూజించాలన్నా పురుషుడికి ఒక్క సంకల్ప మాత్రాన్నే సాధ్యం కాదు. మానసిక-శారీరక సమతుల్యాన్ని సాధించాలి. అందుకు సనాతన తంత్రయోగం కొన్ని అద్భుతమైన ఎక్సర్‌సైజుల్ని మానవ జాతికి ప్రసాదించింది. నేను చేస్తున్న తంత్ర ప్రస్తావన ప్రస్తుతం వీధివీధినా దొరుకుతున్న బజారు తంత్రం కాదు. శివ శక్తుల సమతూకం కోసం గట్టి ప్రయత్నం చేయకపోతే జీవనయానం అల్లకల్లోలమౌతుంది అని గ్రహించిన వాళ్ళు గట్టి ప్రయత్నం చేసి వేదికితేనే గానీ దొరకని మంచి మార్గం ఇది.

స్త్రీయైనా, పురుషుడైనా సాధన చేస్తేనేకానీ సాధ్యం కాదది. ముఖ్యంగా పురుషుడు చాలా ఎక్కువ ప్రయత్నం చేయాలి - పురుష పతాకం నిరంతరం రెపరెపలాడుతుంటుందేగానీ, నిలకడ తక్కువ, కుప్పగూలడం ఎక్కువ కనుక!

అందుకనే యోగి కాని వాడు భోగి కాలేడు. ముందు భోగం, ఆతర్వాత యోగం అన్నది దొంగ సిద్ధాంతం. అది కేవలం పురుష భోగం మాత్రమే! ముసలితనానికి యోగులై, భోగాన్ని నిరశించే పురుషులందరూ మానసిక రోగులే! వాళ్ళందరూ జీవన తత్వాన్ని ఉల్టాగా బోధించే పురుషస్వామ్య ప్రతీకలే!

నిజంగా భోగం అంటే స్త్రీని 'పాసివ్' ని చేసి 'తీసుకోవడం' కాదు; 'యాక్టివ్' చేసి 'ఇచ్చుకోవడం'. ఈ ఇచ్చుకోవడం లైంగికంగానూ, తాత్వికంగానూ అంత తేలిక్కాదు. తంత్రయోగం ఒక్కటే తాత్వికంగానే కాకుండా, భౌతికంగానూ, మానసికంగానూ స్త్రీ పురుషులిద్దర్నీ సమంగా సాధన చేయించగలదు. నేను చెప్పే 'పురుష సూక్తం' ఏమిటంటే,

స్త్రీని 'ఎల్లమ్మ'గా పూజించడానికే కాదు, 'కన్నమ్మ'గా భోగించడానికి కూడా పురుషుడు 'యోగి' కావాలి. యోగి అంటే గడ్డాలు మీసాలు పెంచుకొని, ఆశ్రమాలు పెట్టుకొని, 'వైదీకం' పేరుతో వ్యాపారాలు చేయడం కాదు. సామాన్య జీవనంలోనే యోగాన్ని సాధించాలి. జీవితాన్ని ఎంజాయ్ చేయాలి.

ఓ అనామకుడి తత్వాన్ని, కవిత్వాన్నీ కొట్టిపారేయకుండా నా అదృష్టవశాత్తు ఇద్దరూ గొప్ప కవులు, వ్యక్తులు "ఫర్వాలేదు, చదవండీ..!" అంటూ నాకు రెండు ఇంట్రడక్షన్లని రాసిచ్చారు - పఠాభి, మో !

కవిత్వంలో స్త్రీ పురుష సంబంధాల్ని గొప్ప అర్బనిటీతో వ్యక్తీకరించిన పఠాభి నాకెప్పుడూ ఆదర్శపురుషుడే. పఠాభిగారి 'దుడ్డుకర్ర' నా కవిత్వానిక్కూడా ప్రతీకే! సిగ్గుపడకుండా నాకది బూతుని ట్రాన్సెండ్ అయిన ఓ ఫాలిక్ సింబల్...! గరళాన్ని దిగమింగిన శివ తత్వ ప్రతీక...! సీతని హింసించిన వాణ్ణి దేవుణ్ని; ప్రేమించినవాడ్ని రాక్షసుడ్నీ చేసిన ఆత్మవంచనా లోకాన్ని నడుం విరగ్గొట్టిన ఆ 'దుడ్డుకర్ర' నిజంగా ఆరాధ్యనీయమైన శివలింగమే!

నేను డిగ్రీ చదివే రోజుల్లో 'ద టోన్ ఆఫ్ ఎ లోనర్' 'మో' లో కనిపించి దిగ్భ్రమ చెందాను. అంత ఉన్నతుడు నా కవిత్వానికి ఓ కాంటెక్స్ట్యువాలిటీని ప్రసాదించడం నా అదృష్టం. నిజానికి ఈ కవితల్లో చాలా భాగం ఇరవై ఏళ్ళ క్రితం రాసినా, కొందరు 'నియో బ్రాహ్మల' కోల్డ్ బ్లడెడ్ సైలెన్స్ వల్ల నాకు నేనుగానే ఇగ్నోర్ చేసి, ఇంతకాలం 'బరీ' చేసిన నా కవిత్వాన్ని తిరిగి 'రిసరెక్ట్' చేసింది కూడా 'మో' గారే! "పుస్తకం వెయ్యి" అని ఆయన ఆజ్ఞాపించడం వల్లనే ఇన్నాళ్ళకి పుస్తకంగా వేస్తున్నాను.

పుస్తకంగా రావడానికి ముందే వీటిలో కొన్ని కవితల్ని 'ఆంధ్రజ్యోతి'లో సీరియలైజ్ చేసి, 'మో' గారి దృష్టికి తెచ్చిన 'నామిని' కి కృతజ్ఞతలు చెప్పడం నా విధి.

నా 'కన్ఫెషన్స్' లోని వాస్తవికతని, తాత్వికతని శిల్పపరంగా నాకు అలవడిన కొంత అర్బనిటిలో పాక్ చేశాను. ఈ పాకింగ్ పొరలు నిజానికి ఉల్లిపొరలే! ఒలిచి పూర్తిగా నగ్నం చేయగలిగినవాళ్ళు చేయండి. చేయకుండా కూడా నా కవిత్వంలోని నగ్నతని ఎంజాయ్ చేయగలిగిన వాళ్ళు అలాగైనా చేయండి. నగ్నతని చూడలేక కళ్ళుమూసుకొనే వాళ్ళకోసమయితే నేనీ 'కన్ఫెషన్స్' చేయలేదు.

ఆగస్ట్, 2002

# అగ్గి పుల్ల.... పిచ్చి పిల్ల.... !

ఎంత వెధవని  కాకపోతే
అంత చీకట్నీ
నా
బోడి అగ్గిపుల్లతో వెలగబెట్టేయగలనని
ఆ మంచుకొండని సాంతం తగల బెట్టేయగలనని
తైక్కున తయారౌతానూ...!

పిచ్చిపిల్ల -
తలుచుకుంటే... 'ఉఫ్'ని ఊదిపారేయగలదు...
కానీ ఊదదు...
అంత ఊపిరి లేదు...
'ఖర్మ'ని నిట్టూర్చి
ఆకాశంలోంచి ఓ మెత్తటి మేఘాన్ని

లాగి
తలకింద పెట్టుకోని
కళ్లు మూసుకొని పడుకునేది...

ముందు తెలియలేదు -
ఆవిడి సెన్సాఫ్ హ్యూమర్....!
ఇక చూడండీ... నా అగ్గిపుల్లగోల -
మొత్తానికి ఎలాగోలా
మనసులోని సూరీడి సూదుల వాడికీ.. వేడికీ
ఒక్కోసారి
మంచుకొండ మాత్రం కరిగిపోయేది..
ఇక
నా వేలు
నాకే సురుక్కున కాలి
అగ్గిపుల్ల ఎప్పుడో రాలిపోయేది...!
మరి చీకటో...?
నే
బతికుండగానే
నా
చితిమీద కాలే
ఆ సతి
నా కలా ఎప్పుడూ సావిత్రే...!

నిజానికి పిచ్చిపిల్లే -
కానీ
కనిపిస్తోందా
నా ముఖానికి వేలాడగట్టిందో సిగ్గుబిళ్ల...!

# మగ మీమాంస

దూకబోయే ఉప్పెన్ని పంటి కింద నొక్కి పట్టి
గొంతులోంచి గుండె కొట్టుకుంటూ
సన్నగా
'నా కిద్దరూ కావాలి...' అంది !

పొంగుతున్న రాగ రాసియా కసిగా తెగి
తీగ ఛెంగుమంది...
ఆమె కాలి కింద
నా గుండె గతుక్కున చితికినట్టయింది...
మనిషీ కావాలి...
పశువూ కావాలి... అనే స్త్రీని
సముద్రాన్ని ఔపోసన పట్టినంత తేలిక్కాదు కదా
దిగమింగడం...!
నిజం -
తనకు ఖచ్చితంగా ఏం కావాలో తెలిసిన
స్త్రీని
అంత తేలిక్కాదు ప్రేమించడం....!

నాకు ఖచ్చితంగా తెలుసు -
నాకు ఆవిడా కావాలి...
మా ఆవిడా కావాలి... అని !
నా నాలికప్పటికే రెండుగా చీలిపోయినా కూడా
నా ఆకలికి అనిపిస్తోనే వుంది -
గుండెలో నిండుగా నేనుండగా
ఆవిడకు దొడ్లో
ఇంకా ఆ పశువెందుకు... అనే !
నిలువుగా కోసి.... వేంఠనే
ఏదో ఒక్కతే తేలుద్దాంవనే...!

ఎన్ని యుగాలైనా ఎడతెగని
ఈ మగ మీమాంసలో
కందిరీగ లేవనే లేచింది.....
కుట్టి కులకక మానదు...
పట్టి నా ప్రశ్నే నన్ను గొంతు నులంవకా మానదు...
ఎస్.... ఎస్సెస్....
ఎవడు వేసినా... నాకు నేనే వేసుకొన్నా
ప్రశ్న మాత్రం ఒక్కటే -
ఆవిడి
పశు స్థానాన్ని భర్తీ చేయదలుచుకున్న వాడ్ని
ఇంతకీ నేనెవడ్ని ...?

ఆగండి... అప్పుడే చెప్పకండి -
ముందు నన్ను ఆకాశాన్ని తవ్వనివ్వండి...!
నా నీడన్నన్ను పాతి పెట్టనివ్వండి...!

పసుపులేటి పూర్ణచంద్రరావు

# కన్నమ్మా...!

తచ్చాడుతూ అప్రయత్నంగా ఆకాశంలోకి నడిచినా
కన్నమ్మా...!
కళ్లులేని వెధవలకి
దేవతలు ప్రత్యక్షమైనా కళ్ల కద్దుకోలేరు కదూ...!
అలాని
ఆ పిచ్చి దేవతలు కనిపించకుండానూ ఊరుకోరు..!
కానీ ఆశ్చర్యం ఏవిటంటే -
ఒక్కోసారి ఐడెంటిటీ ప్రోబ్లంతో
ఇంత గొప్ప దేవతలూ
హడావిడ్లో... అర్థాంతరంగా... ఆకాశంలోంచి తూలి

అంతకన్నా వెధవల
అర్థహీనమైన కౌగిళ్లలో రాలిపోతారు...!

అయినా
అమృతం తాగిన ఆ ఆడవాళ్లు
అలా మురికి మంటల్లో కణకణా కాలిపోయినా
నల్లగా మాత్రం మాడిపోరు..
కాకుంటే... కన్ఫ్యూజన్లో కాస్తంత వాడిపోతారు...
ఆ బంగారు గుండెల బొమ్మలు
కాలిపోతే మాత్రం -
కాకపోతే కాస్తంత కరిగిపోతారేమో గానీ
ఆత్మల్లో మాత్రం ఏ మాత్రం తరిగిపోరు...
ఈ సారి మరింత ధగధగలాడిపోతారు...
అత్యంత అద్భుతంగా భగభగలాడిపోతూ
ఛాన్సొచ్చింది కదాని కాల్చుకు తిన్నవాడి
మురికి మూతి మీద తన్ని
ప్రచండ వేగంతో... బంగారు రెక్కల్ని బలంగా విప్పుకోని
మళ్లీ
ఆకాశంలో హాయిగా ఎగిరిపోతారు...
స్వేచ్ఛా ప్రపంచంలో తియ్యగా తేలిపోతారు...
కానీ అలవాటు కొద్దీ
మళ్లీ ఎప్పుడో ఓసారి
అంత అందమైన కళ్లని అద్భుతంగా తెరుచుకోని
అర్థహీనమైన ఈ నేల వంకే చూస్తారు...
అర్హత లేకపోయినా
ఈ సారి
ఆ అదృష్టవంతుడెవరో...!

# పెళ్లి... గిల్లి...!

'షో' పేన్'
'ఫ్యూనరల్ మార్చ్' ఎప్పుడన్నా విన్నావా ?
పియానో పగలగానే పెళ్లి పందిరి కనబడుతోంది కదూ...?
అవును...
ఆడదాని ఎముకల్తో.. కంకాళాల్తో కట్టిన
ఈ కొంప
ఎప్పుడో ఓసారి కూలిపోక తప్పదు...!

కానీ ప్రతిసారీ
ఏ చిన్నారి చిట్టి వెధవో
ఓ పొన్నారి పొట్టి బుడితో
చమత్కారంగా కూలబోయే ఆకాశాన్ని అతి తేలిగ్గా
చిటికెన వేలితో ఆపుతుంటారు గదూ...?

కానీ మగ పిడుగు
మళ్లీ ఎప్పుడు పడుతుందో
ఆ చిటికెన వేలికేం తెలుసు...?

ఆ కొంపలోనే
చితికిన ఓ గుండె నడుగు.... తెలుస్తుంది !
అడుగులు కతుకుతూ కూడా అసహ్యంగా అరుస్తున్న
ఆ కుక్కని మాత్రం అదిలించకు.. కరుస్తుంది !

షోపేన్
'సొనాటా నెంబర్ థూ' లోని
ఫ్యూనరల్ మార్చి ఇప్పుడన్నా విను...
ఎన్ని చమత్కారాలు చేసినా
ఎవర్నీ ఏమార్చ లేవు...
కాసేపే తమాషా...!
అబద్ధాల్లో ఎక్కువ సేపు నిలవదు నిషా...!
తప్పదు -
పడ్డ పిడుగు మగదైనా ఆడదైనా
వేళ్లూ.. కాళ్లూ.. నోళ్లూ... మొత్తుకోళ్లూ...
ఎన్ని పైకొత్తి నిలిపినా
నిజం వికృతంగా విచ్చుకోక తప్పదు...!
ఆకాశం ఎప్పుడో కూలిపోకా తప్పదు...!
అయినా లోకం నిజం మాత్రం చెప్పదు...
కదూ కన్నమ్మా...!

చింపి చూసినా
మీ ముసుగుల్లో సుఖంగానే వున్నాం అంటూ
నవ్వినట్టుగా ఇంకా ఏడుస్తూనే ఉన్నారా...?
ఛావండి -
ఇప్పుడన్నా పోయి
'ఫ్యూనరల్ మార్చ్' వినండి...!

# సౌందర్యం కోసం

ఆ అందం...

ఆ ఆత్మ...
ఆ సంపూర్ణ సౌందర్యాన్ని అనుభవించే అదృష్టం
జన్మలో ఒక్కసారి లభిస్తే చాలదా...?
ఆ దేవతకు
ఎంతమంది భక్తులుంటే నీ కెందుకు ...?

పిచ్చివాడా...!
ఎంత స్వార్థంతో కానీ

ఉత్త సహృదయంతోనే కానీ
సౌందర్యానికి సంకెళ్లు వేసి.. చంకలో బంధిద్దాం అని
పిచ్చి ప్రయత్నం చేసే
చరిత్రంతా
ఒళ్లంతా పొడుచుకు చచ్చిపోయింది....!
నువ్వు పొడిచినా... పొడుచుకున్నా
చచ్చిపోయిన చరిత్రలో
నీదీ
ఓ చిత్తు కాగితం అవుతుంది... అంతే !

చాతనైతే
నీ దేవత
నీ చేయి వొదిలినా చితికిపోకు..
చిట్లిపోయిన గుండెనే చేతిలో పట్టుకొని
చెమ్మగిల్లిన కళ్లతో
చిట్ట చివరిగా చేయి ఊపు..!
పోతే... గుండె విచ్చిపోనీ గానీ
మొట్ట మొదటి సారి చూడగానే
నీ దేవత కోసం
నీ గుండె ఎలా కొట్టుకుందో
ఆ పిచ్చి ప్రేమని మాత్రం చచ్చిపోనీకు...!

తార రాలి
తిరిగి నీ తల మీద వాలి
నువ్వు తరించే తరుణం
వొచ్చినా రావొచ్చు...
చచ్చిపోకు...!
అవునా... కన్నమ్మా !

పసుపులేటి పూర్ణచంద్రరావు

# మానుషి - మాస్క్

ఆమె నడిపేది ఏదో మోపెడ్ కాదు...
కనీసం స్కూటరన్నా కాదు...
అమాంతం
అరివీర భయంకరంగా బులెట్...!
ఆహా.... బులెట్...
అసలు సిసలైన మగవీర వాహనం...... బులెట్...!
బులెట్...! బులెట్....!

'లంజ....
మొగాడిలా కాలెత్తి
ఇట్నుంచి అటేసి మోటార్ సైకిలెక్కుతోంది...!'
అని ప్రతిసారీ అగ్గీగా బావురుమంటారు -
ఉత్త మీసాలు తప్ప
చెప్పుకోను మరో ఏ గొప్పాలేని మొగవాళ్లు....
అంత ట్రాఫిక్‌లోనూ ఆవిడి స్పీడుకి
నోళ్లు తెరిచి మూర్ఛలుపోతారు -
కేవలం కాళ్ల పొడుగులో తప్ప
ఆవిడికన్నా
మరే హైటూలేని మొనగాళ్లు...

'ఫడ్‌గయా...!'
అని అసహ్యంగా అరవబోయిన వెధవల్ని
ఆవిడ అధిరోహించబోతూ

అటు వేయబోయిన కాలు తీసి... ఇటువేసి -
'ఢోన్ట్ వరీ ఎబౌంట్ మై జీన్స్.. యూ బాస్టర్డ్స్ !'
వరీ ఎబౌట్ యువ‹ బాల్స్.....!
ఐ ఇల్ కిక్ యూ...!'
అని పగలగొట్టిన ఆవిడి అదీదిస్ దెబ్బకు
పళ్ళు రాలిన వాళ్లు....

అదును చూసి ఆవిడి అహం తాకబోతే
ఆ ఎలక్ట్రిక్ షాక్కు వేళ్లు కాలిన వాళ్లు...
'అమ్మో....!
యమ ఫాస్ట్ ముండ...!' అనేసి
మెల్లిగా ఎవరి గోతిలోకి వాళ్ళు జారుకుంటారు...
పాత సింబల్ -
అందని ద్రాక్షలా పుల్లగా వుందనుకుంటారు...
'అమ్మ బాబోయ్....! అది మాత్రం ఆడది కాదు...!'
అని
అచ్చ తెలుగు రెటోరిక్‌లో గుండెలు బాదుకుంటారు...

అయితేనేం -
ఆఫీస్‌నించి ఒక్క కిక్‌కి
సాయంత్రం స్కూల్‌కెళుతుంది...
కన్న కొడుకుని పిక్ చేసుకుంటుంది...
అంత ధీమంతురాలు అమ్మ అయినందుకు
కొడుకు కొండంత ఆనందంతో
వెనకనించి వెన్ను కతుక్కుంటే
ఆ ఒడివెచ్చదనానికే రెచ్చిపోయిన వేగంతో
బులెట్ మీది భామ

బల్లెంలా ఇల్లు చేరుకుంటుంది...
భళ్లున తలుపు తెరుస్తుంది...
ఫెళ్లున విరిగి మంచంలో కూలిపోతుంది...

ఇక అంతటితో
ఆ మంటల మాస్క్ తీసి
విసిరి... మంచం కింద పారేస్తుంది...!

కొసరి
కొడుక్కి గోరుముద్దలు తినిపిస్తుంది...
కసిరి
కసాపిసా క్లాసు పుస్తకాల్ని నవిలిస్తుంది..
ముసిరి ముద్దులు పెట్టి
ఆ ముద్దుల పట్టిని జోకొట్టి నిద్దరుచ్చుతుంది...

ఇక అప్పుడు తీస్తుంది -
ప్రతిరాత్రీ తను పూజించే
తన త్రీ డియరెస్ట్ డ్రింక్స్‌కి ద్వారం... !
గటగటా మింగితే క్షణం పట్టదు -
ఆమె దాహానికా మూడు గుక్కల హారం...!
కానీ
కణ కణమూ చప్పరిస్తూ
మెల్లిమెల్లిగా
ఆ కరకు చల్లటి రేయి నంతా
క్షణక్షణమూ తాగుతుంది ...!

ఒక్కో రాత్రి
మత్తుగా మందంగా సాగే
బడే గులాం 'గుర్జరీ తోడీ' గంభీర గానంలో
గుండ్రంగా తనలో తాను వలయాలు తిరుగుతూ తూగుతుంది...
ఒక్కో రాత్రి
అమీనుద్దీన్ దగర 'ధృపద' దావానలాన్ని
దాహంగా గటగటా తాగుతుంది...
ఒక్కోరాత్రి
రవి శంకర రాగ 'రసియా'లో
పరవశించి
తడిసిన గొంతు విరిసి పాడుతుంది...
ఒక్కో రాత్రి
పర్వీణ్ సుల్తానా ప్రేమవీణ 'తిలక కామోదం'లో
ఛటుక్కున ప్రావోక్ అయ్యి
మంచుకొండ మంటలంటుకుంటుంది.

పాపం.... ఏం చేస్తుంది -
కట్టలు తెగిపొర్లే
ఆ అగ్ని ప్రవాహాన్ని తట్టుకోలేక
పరువాన్ని పరుపు చుట్టలు చుట్టుకోని
పళ్లు బిగించి
సూరీడ్ని అంటుకున్న ఆ తలతెచ్చి
చన్నీళ్ల టాప్ కింద పెట్టేస్తుంది...!

గుండె పగిలి ఆ తల్లి
పండు లాంటి కొడుకుని కడుపులో చేర్చి

దిండులో తల దూర్చి
ఓ సముద్రాన్ని సొంతం పాతి పెడుతుంది...!
ఏ రేయీ
ఏ చేయీ
ఆమె తల నిమరలేదు...
ఎద మురిపించలేదు...
ఆద మరిపించలేదు...
నిదర రప్పించలేదు...
ప్రతి కటికి రేయీ పలచబడి
ఆమె కన్నీటి రేవులోనే కరిగిపోతుంది...

ప్రతి రోజూ పొద్దెక్కి
వంట మనిషి పంపించిన
కటకటలాడే కాఫీ కప్పుతో
కొడుకు లేపితే లేచి
కన్న తండ్రిని కావిలించుకొని
'కనీసం నువ్వొక్కడివన్నా
మనిషైన మగవాడివి కమ్మ'ని కసిదీరా దీవిస్తుంది...!

ఇక దిగ్గున లేచి
మళ్ళీ
ఎర్రటి మాస్క్ తగిలించుకొని
మోటార్ సైకిలెక్కి
మండుతూ... మగ ప్రపంచంలోకి
ఒంటరిగా
సూరీడికి తల్లిలా
తెగ వేసే వేగంతో దూసుకెళ్లి పోతుంది...!

పోస్ట్ పోయమ్ :

ఆ తల్లి నడిచిన ప్రతి అడుగుకీ
నా తల ఆన్చడం తప్ప
నేనిక
వేరే ఏ పూజా చేయలేను...

నా భక్తికి లొంగి
ఒక్కోసారి ఆ కొమ్మె నా తల మీదికి ఒంగినా
ఎంత మధురమైనా సరే
నా పూజా ఫలాన్ని నేనే కోయలేను...
నా అల్పత్వం నాకు తెలుసు గనక
నగ్నంగా నిలుచున్న
ఆ ఔన్నత్యం ముందు నే నిలవలేను...

కానీ నాకు తెలుసు
చివరికి ఆకలికి... ఆబగా
నన్నో...
నాలాంటి మరో ఎండు గడ్డినో కరకరా నమిలినా
తానే నలిగినా ...
తెల్లారి పొద్దున్న మేం వెవ్వరం అయినా
కేవలం షిట్‌గా
టాయిలెట్లో ఫ్లషవుట్ కావాల్సిందే ... కానీ
ఆవిడి గుండెల్లో మాత్రం నిలవలేం....!
అందరం
ఆ క్షణం పుట్టి ఆ క్షణమే చచ్చే
పురుషులం...! పురుగులం...!

# మాయా దర్పణం

అరే
నేనూ 'నార్సిసస్' నేనా...?
మరి నేను నేను గాక
'డిసీరో' నైతే బాగుండు అనుకుంటానే...!

డేంజరెక్కడంటే -
నేను ప్రేమించేది నన్నుకాక
నా 'రాబర్ట్ డినీరో' మాస్క్ నేమో...!
మట్టిని కాక మబ్బుల్నేమో..!

మరి కన్నమ్మో...?
నా కన్ను కదా...!
ఆ కన్నులోంచి కారే చీమల్నేం చేయను...?
నా వేళ్లలోంచి మొలిచే పూలనేం చేయను...?
ఛత్....!
నేను నార్సిసస్‌ని కాను...
నాకు నిరంతరం ముద్దొచ్చే
నా కన్నమ్మ బంగారు బుజ్జి ముక్కు నేను కాను...
నిరంతరం నా నోరూరించే
ఆ కమ్మటి మీగడ పెదిమలు నేను కానే కాను...
కాను...!

ఈ ఆబ్జక్టివిటీ అన్నా లేకుంటే -
ఆ అందాన్ని చూస్తూ... చూస్తూ... నన్నునే మరిచిపోయి
నా తల ఆమె నేలలో పాతుకుపోయి
నేనో మతిలేని మర్రిచెట్టుగా మారకపోతే -
నా చేతులు
ఊతల ఊడలుగా కన్నుసాగినంత దూరం
నా పిచ్చి ప్రేమ జైలు కటకటాల్లో
నా కన్నమ్మని బందీని చేయలేకపోతే -

నా గుండె మధురంగా బ్రద్దలు కాదు కదా....!
నా మండే ఆకాశం మత్తుగా మంచు కురవదు కదా...!

నో... నో.. నో... !
దాలీ 'కోడి గుడ్డు' చిట్లికలోంచి
నా 'పువ్వు' పుడుతున్నట్టే వుంది...
నా కన్నమ్మ చెంపల అద్దాల చమక్కుల్లో
నా ముఖమే కనబడుతోంది....

నా అగ్గిని
ఆపిన ఆవిడి అరి చేతిలోనూ
నా ముఖమే కనబడుతోంది...
ఆవిడ కొంగు కప్పి దాచిన మానస సరోవరంలోనూ
నా ముఖమే కనబడుతోంది....
నేనేం చేయను...?

ఈ అద్వయిత మాయా దర్పణంలో
అనిపిస్తోంది -
నా కన్నమ్మ కూడా నేనేనేమో ...!
నేనూ నార్సిసస్ నేమో...!
నో... కానేమో....!
నో... అవునేమో....!

# టే కాఫ్

ఎంత నెత్తురు నింపుకున్నా
గుండె కారిపోతూనే వుంది....
బతుకు ఎండిపోతూనే వుంది...
ఆమె వెళ్లిపోడానికే నిర్ణయించుకుంది....!

గుమ్మంలో
ఆమె రెండు కళ్లూ తెచ్చి వేలాడదీశాడు -
తల దిరిగి
తిరిగి..... తన కాళ్ల మీదే కూలిపోవాలని...
అయినా
ఆమె వెళ్లిపోవాలనే నిర్ణయించుకుంది...!

కళ్లగంతల తక్కెడ దగ్గిరకెళ్లి
గుండె చీల్చి చూపించి... లేదా
గుండెలో పొడిచి కళ్లు తెరిపించి
తన రెండు కళ్లూ తెచ్చుకుందామన్నా
ఆ ఆకాశం పాడుగానూ -
దాన్ని నమ్ముకున్న పాపానికి
దయతో పడాల్సిన కాసిని చల్లటి చినుకుల బదులు
కులకుల్లాడుతూ
పదివేల బెకబెకల బావురు కప్పలు రాలి పడ్డాయి...!
పర్వతం పేలి... పలుగురాళ్లు ఎగిరి పడ్డాయి....!

తగలబోయిన రాయిని తప్పించుకున్న
పగలబోయిన తలకాయితో
'పళ్లు కొరకొద్దు -
కేవలం కళ్లు మాత్రం పీకేస్తాం...!' అన్న
కప్పల తక్కెడ న్యాయాన్ని
దాని కోరలు ఎంత పొడవున్నా సరే
తెగించి.... మూతి మీద తన్ని
'టే కాఫ్ ....' అనేసింది !
తన రెండు రెక్కల్నే నమ్ముకోని
తన రెండు కళ్లనీ రెప్పల్లో దాచుకోని
మండిపోతూ
మూడో కన్ను మాత్రం తెరుచుకోని
కొత్త వెలుగులో స్వేచ్ఛని పీల్చుకొంటూ
నల్లటి మబ్బుల్ని చీల్చుకొంటూ
దారి తెలియకపోయినా
ఆకాశంలోకి మాత్రం ఎగిరిపోయింది...!

గురి చూసి క్రూరంగా వడిరాయి విసిరాడు -
గుండెలో గుచ్చుకొని
గువ్వ సుడి తిరుగుతూ
రాలి
తిరిగి తన కుంపట్లోనే పడాలని...!
కమ్మగా కాల్చుకు తినాలని...!
కానీ
సొంతగా వెలిగే చుక్కలు
చచ్చు గ్రహాలు విసిరే
రాళ్లకూ రప్పలకూ రాలి పడతాయా...?
రక్తం కారుతున్నా
రగులుతూ... వెలుగుతూ... స్వేచ్ఛలో తేలుతూ
సొంత రెక్కల్తో ఎగిరిపోతూనే వుంటాయి...
తనలాంటి
ఎండిపోయిన గుండెలకు వెలుగునిస్తూనే వుంటాయి...

పోస్ట్ పోయమ్ :

అయితే.... ఏ స్వేచ్ఛా కథలూ
ఓ పట్టాన సుఖాంతం కావు...
కాకపోతేనేం.... రెక్కలంటూ రావాలే కానీ
ఏ చుక్కలూ.... చీకటి గదుల్లో మాత్రం చిక్కవు.... 'ఉ'!
కానీ
తిరిగి చిక్కుకున్నావెందుకురా
కన్నమ్మా.....!

# ప్రతి పాదం పరమ పంకిలంవే కదా....!

ఆ కమనీయమైన కంచన్‌జంగ శిరం మీద
కాలుపెట్టి మురిసిపోయాను.. మూర్ఖుడ్ని !
నా కాలికింద కన్ను పొడవగలిగీ
ఆ క్షణంలో పొడవలేదు.... ఆ సుందరి !
ఆవిడి సెన్సాఫ్ హ్యూమర్ అటువంటిది...!

శిఖరాలు ఎప్పుడూ ఉన్నతంగానే వుంటాయి....
కానీ

పరమ పవిత్రం అని భ్రమించి
ఒక్కో పాదాన్ని తాకేందుకు
ప్రేమతోనో... భక్తితోనో
శిరస్సు వంచి మోకరిల్లుతాయి.. అంతే !

కానీ పాదాలు పాదాలే...!
మగమట్టి
గట్టిగా అట్టగట్టి
నిర్జీవంగా..... నిలువు కాళ్లుగా నిగడదన్ని నిలబడి మాత్రం వుంటాయి...
కోట్లాది వెంట్రుకలు మెలి తిరిగి మదించి గాల్లో తేలుతుంటాయి....
నరాలు నగ్నంగా పొంగి పాకుతుంటాయి...
కొన్నిటికి గిట్టలుంటాయి...
కొన్నిటికి పట్టా కత్తులుంటాయి...
కొన్నిటికి పాదాల్లోనూ క్రూరమైన కళ్లుంటాయి...!

పిచ్చి పిల్లలూ....!
ఏ పాదమ్మా పవిత్రం కాదు -
తేరగా మీ తలల మీద పెట్టనివ్వకపోతే...!
పెట్టనిస్తే
ప్రతి మరుగుజ్జు వెధవకీ
ఎంతంతెత్తు కంచన్ జంగైనా లోకువే...!
ఆరడుగుల నా స్విస్ సుందరైనా...
అందితే ఎంత 'కెలీ మాక్గిలీ' యైనా..!

నిజం చెప్పు కన్నమ్మా...!
నేనూ అంతేనా...?

# మీ టూ ఏ బల్తజార్...!

స్ రైన్ డివైన్ ఫేసెస్
మేక్ మీ ఎన్ యాస్.... నేనేం చేయను ?
నా గుండె కదలిక చూసి
ఒక్కో ముద్దు ముఖం ముందు కూగుతుంది కూడా...!
కానీ ఆవిడ -
ఆ ముద్దు ముఖంగల ఒకానొకావిడ
నేను గాడిద కన్నా
గుర్రం అయితే బాగు అనుకుంటుంది.... వాట్టూడూ ?

నాకా చూపే ఓ శాసనం
కాబట్టే కదా -
ఆ పనికిమాలిన సెమినార్లో
ఆవిడ పాతిక పేజీల పేపర్ బోర్‌కి
పదిమంది శ్రోతలు లేకున్నా
పాతికమంది మందం చప్పట్లు నేనొక్కడ్నే కొట్టింది ...!

ఆ కమ్మటి పెదిమల మీది
నా వెచ్చటి కసివల్ల కాదూ -
సిలోన్ రిపాట్రియేట్స్‌ని పాట్ చేయడానికి
కొడైె కొండలెక్కేందుకు
నన్ను మంచి గాడిదగా భావించి
ఆవిడ నా వీపు మీదెక్కి కూచున్నప్పుడు
వెన్నులోంచి వణుకు గుండెలోకి తొణుకుతూ

ఆ రెండు మెత్తటి మబ్బుల బరువుల్నీ
మహాభాగ్యంగా నేను భరించింది...!

'గుడ్ బోయ్...!' అంటూ
అవసరం అయినప్పుడల్లా నాకు
తన ప్రియమైన ఎకడమిక్ పేపర్లని మేపుతూ
నా వీపు మీదెక్కి ఊరేగిందే కానీ
ఎంత బైట పడొద్దన్నా కూడా
'గాడిద కన్నా వీడు గుర్రం అయితే బాగు...'
అన్న
భూమ్యాకాశాల తారతమ్య తత్వం మాత్రం
ఆవిడి కళ్ల వెనకే నక్కి చూసేది...!

ఖర్మ...!
ఈ అడ్డమైన గాడిద చాకిరీ
రెండేళ్లు చేసినా
ఆ రెండు కళ్లతో ఎప్పుడూ కసిగా చూసేదేగానీ
ఆ పొంగే సముద్రంలోకి
ఆవిడ తన కొండ మీంచి
నన్ను కావిలించుకొని మాత్రం దూకేది కాదు...!

పైగా
ఆవిడి 'రోడ్స్' స్కాలర్ మొగుడుగారొకరు -
నా ఎడమ కంటి కొసలోంచి
దూరంగా
క్రూరంగా

కీలకమైన మా ప్రతి ఏకాంతంలోనూ
క్రమం తప్పకుండా కనిపిస్తూ...!
రెక్కలు విచ్చుకుంటున్న నా బక్క ధైర్యాన్ని
ప్రతిసారీ ఒక్క క్షణంలో కబళిస్తూ.. స్తూ...!

అలా
ఆయన కనిపించినప్పుడల్లా
సింహాన్ని చూసిన గాడిదలాగా
అతి గౌరవంగా నేను
గుడ్ మార్నింగ్లూ... గుడీవినింగ్లూ చెప్పినా కూడా
కోరలిప్పి
చిటపటలాడిపోతూ ఓ రోజు -
పసుప్పచ్చటి కంచి పట్టు చీరలో
పిటపటలాడిపోతున్న ఆ లేడి పిల్లని పట్టుకోని
'ఏ పురుగువంకైనా చూడుగానీ
ఆ గాడిద వంక చూశావంటే మాత్రం
పబ్లిగ్గా.. కాంపస్‌లో నీ చీర వొలిచేస్తా...' అన్నాడత !

పాపం .... ఆవిడ మాత్రం ఏం చేస్తుంది -
ఏ నాటికైనా ఓ ముద్దన్నా పెడుతుందనుకున్న వాడ్ని
ఎండు గడ్డన్నా పెట్టకుండా
తన 'రోడ్స్' వాడి కినపడేలా
'ఛీ...! ఫో... గాడిదా...!' అంటూ
నన్ను రోడ్డు మీదికి తోలేసింది...!

ఎస్... 'బస్సో...'!
మీ టూ ఏ 'బల్తజార్...!'

# నా ముంబాయీ బాయీ...!

('బ్రాట్ ట్రిలెజీ' నెం : 1)

బొంబాయిలో
నాకు నచ్చని సముద్రంలో సాయంత్రాలు స్నానం చేసే
సూరీడ్ని
నీ కిటికీలోంచి చూపిస్తే -
కనీసం అప్పుడన్నా చల్లగుంటాడేమోనని

ముద్దుగా
వాడి పిచ్చి జుట్టులోకి వేళ్లు జొనిపితే
గోళ్ల చివళ్ల నించి
భగ్గని మంటలు నాలికలు సాచినా
నీ కోసం ఆనందించాను....

నీ ఫోర్క్
నా గుండె కాయలో గుచ్చుకున్నప్పుడు
కసుక్కున నొచ్చుకున్నానే గానీ
కమ్మగా నీ పళ్లకింద నలిగేటప్పుడు మాత్రం
నీ ఆకలి కోసం ఆనందించాను...

గుడ్ బోయ్స్ కూడా బాడ్ బ్రాట్స్‌గా
పాలకు ఎంత ఏడిస్తే మారతారో
నాకు బాగా తెలుసు కనుక ఒప్పేసుకుంటున్నాను -
నేను మాత్రం ఎవరికీ పోటీ కాను సుమీ...!
స్త్రీ
నీలా మాన్ ఈటర్‌గా
ఎంత దెబ్బతింటే మారుతుందో
నాకు తెలుసు కనకనే ఒప్పేసుకుంటున్నాను -
నాదే... కేవలం నాదే ఓటమి...!

పోనీలే
నువ్వే కాళివి...
నేను
నీ కాళ్ల కింద నలిగే మరో శివుణ్ని...!

# బెర్గ్‌మన్‌గారి భార దుర్భర 'నిశ్శబ్ద' గీతం !
## (బ్రాట్ ట్రిలెజీ నెం : 2)

బొమ్మ
ఇరెసిస్టబుల్ అండ్ ఇంపాజిబుల్ 'ఇంగ్రిడ్ తులిన్' అయితే
ఇక
బొరుసుకు విలువేఁవన్నా వుంటుందా -
అవటానికి ఆవిడెంత గడ్డ పెరుగులాంటి
'లిన్ బోమ్' అయినా...!
వయసెంత బూమ్‌లో వున్నా...!
ఎంత కొమ్మలు పొంగుతూ వున్నా..!
కొమ్మ ఎంత వయ్యారంగా ఒంగుతూ వున్నా...!
చకచకా నడుస్తొంటే
కటి కింది మేఘాలు పకపకా నవ్వుతున్నా...!

కానీ... వెతకకుండా వుండలేని కళ్లు...
దాహంగా జాపినా నిండని... నిండనివ్వని
ఎన్నో చీకటి దోసిళ్లు..!
ఆ తిరుగులేని అక్క -

తన నాణెం తిరిగేస్తేనే గానీ కనిపించని
తన చెల్లిని ... చెల్లి కొడుకునీ తీసుకుని
అనుకోకుండా ఆరోగ్యం చెడి
అర్ధాంతరంగా ప్రయాణం ఆపి
అందాలెన్నున్నా అర్థం కాని
ఓ అలికిడిలేని వింత దేశంలో దిగింది...

సన్నటి మనుషుల్లేని సందులు...
ఆకాశంలో అరల్లాంటి హోటల్ గదుల్లో చీకటి చిందులు...
మింటిని కుక్క చుక్కలా
ఆ ఇంటిని నిరంతరం అంటిపెట్టుకొని పడివుండే
ఓ ముసలి సేవకుడి కంటిరెప్ప...
గంపకింది కోడిపిల్లల్లా
ఓ మరుగుజ్జు మ్యూజీషియన్ల కులకుల కలకల కప్పల కుప్ప...
పాతి పెట్టిన కాఫిన్లోంచి క్రూరంగా ... కీచురాయిలా
అప్పుడప్పుడూ సన్నగా వినిపించే
'బాఖ్ - గోల్డ్‌హెర్గ్ వేరియేషన్స్' 25 వ కదలికలోని గొప్ప..
తను.. తన ఇద్దరూ తప్ప
అంతా శూన్యమే..!
అంతా నిశ్శబ్దమే..!

ఆ అక్క
తన వీపుకి వీపు పెట్టి అవతలి వైపుకు తిప్పుకున్న
తన చెల్లెలి తలని
తన వేపు తిప్పుకోవాలని
తన తల వెనక ప్రతిబింబాన్ని తానే ముద్దుపెట్టుకోవాలనీ
అవడానికి తను బొమ్మ కనుక
తన బొరుసు మీద తగని దురుసు చేయబోయింది...!

ఈ లేకి లెస్బియన్ వాలకానికి
మూతి మీద వేడివేడి వాతలు పెట్టాలని
ఆ చెల్లి
తల తిప్పలేని తన అక్కని
వెన్ను వెనకనించి చల్లటి కత్తిమొన ఆనించి వణికించినట్టుగా
కారిడార్లో పోతున్న ఓ వెయిటర్ని కాలర్ పుచ్చుకులాగి
మూతి అదిరేలా గుచ్చి
మూడు ముద్దులు పెట్టింది...!

తల వెనక
తనకు పనికిరాని మగవాసనకి
వాడితో
తన చెల్లెలి ముద్దుల భాషణకి
కుతకుత ఉడికి వేడిగా నీరుగారి పోయింది
పాపం.... ఆ అక్క !
బాధగా చెవిలోనేమో బెర్గ్‌మన్‌గారు ఆపకుండా వినిపించే
బాఖ్ బాకా మరో పక్క...!

అంతటితో ఏమైందిం....?
ఇంతకాలం బొమ్మ చెప్పినట్టుగా
వెన్నుకంటుకునేవున్న బొరుసు కాస్తా.... బొరుసు కాస్తా...
బాంగ్‌మంటూ, బాగ్ తీసుకోని
తన 'బ్రాట్' లేత రెక్క చేత బుచ్చుకోని
తన రెబెలింగ్ రెక్కల్ని రెపరెపలాడించుకొంటూ
బిత్తరపోయి చూస్తున్న
మరుగుజ్జుల శబ్దంలేని దుర్భర సంగీతాన్ని చీల్చుకొంటూ
బొమ్మ నొదిలి
బొరుసు కాస్తా లే... లేచిపోయింది...ది !

# స్ఫింక్స్
## (బ్రాట్ ట్రిలెజీ నెం : 3)

గాయం ఎక్కడో తెలీని బాధతో
శూన్యంలోనూ.... నిశ్శబ్దంతోనూ
ఆడుకునే.... నో... యుద్ధం చేసే
ఆ పసివాడి ముఖంలోని ఇనొసెంట్ క్రూయల్టీ చూస్తే
భయమేస్తుంది....

వాళ్లమ్మ
వారానికో బొమ్మన్నా కొనిస్తుందా -
ప్రతి గుర్రం.. ప్రతి రైలూ... ప్రతి బార్బీ.... ప్రతి హీమానూ
చేతికందిన మరుక్షణమే అతి క్రూరంగా హింసించబడి
ప్రతి చెయ్యీ కాలూ నరకబడి
ప్రతి తలా పచ్చడి చేయబడి
గిలగిలా... బరబరా... కిరకిరా... ఆహాకారాలతో
ప్రతి బొమ్మ ప్రాణం
స్ప్రింగులూడి... పైకి తన్నుకులాడి హత్య చేయబడుతుంది...!
గుడ్డ పీలికలు వెళ్లుకొస్తూ
చాకుతో టెడ్డీబేర్ పొట్టకోయబడుతుంది...!
పెద్దపులి కళ్లు పీకబడుతుంది...!

అంతేనా -
ఒక్కోసారి వాడి చిట్టి చేయి గట్టి గడకర్రగా పెరిగి

ఇంట్లో వెలిగే బలుబు బాంబులా పేలుతుంది...!
వాడి పొట్టి సన్నటి వేళ్లు కంకరరాళ్లుగా మారి
కిటికీ అద్దం ఫటుక్కున పగులుతుంది...!
తిరిగే ఫాన్ రెక్కల్లోకి
అమ్మ ఆరాధించే జెర్మేన్ గేర్.. జూలీ మిషేల్
మిస్ ఫైర్డ్ మిసైల్స్‌గా దూసుకెళ్లి
ఒళ్లంతా చిరిగి చెల్లాచెదురుగా నేల కూలతారు....!
ఎప్పుడు ఏ టి.వి. పగులుతుందో
ఎప్పుడే గడియారం పేలుతుందో ఎవరూ చెప్పలేరు...!

వాడ్ని లాగి చెంపమీద కొడితే సామాన్యంగా ఏడవడు....
కానీ... కళ్లలోంచి కనీసం ఓ వెయ్యి సూదులైనా
సర్ సర్‌న విసరక మానడు...!
వాడి చల్లటి మౌనం ముందు
ఎర్రటి సూర్యుడు కూడా ఎక్కువసేపు నిలవడు...!

పాలసీగా ప్రతి రోజూ ఏదో టైంలో
పక్కింటి తులసికోటలో ఉచ్చపోస్తాడు...!
వాళ్లమ్మ సరిగ్గా తిండితినే సమయానే దొడ్డికెళతాడు...
పదేళ్లొచ్చినాసరే ముడ్డి కడగమంటాడు....!

సిపియా టోన్లో... తండ్రి ఓపెన్ కాఫిన్ పక్కనే
బుల్లి సూట్లో
వీడి బిక్క మొహం ఫేడవుట్ ఫొటో తీసి
ప్రతిసారీ గోళ్లతో గీరతాడు...
ఛటుక్కున తిరిగి కార్పెట్ కిందే దాస్తాడు...!

ఒక్కోసారి
నిశ్శబ్దంగా ఖాళీ కారిడార్లో తిరుగుతుంటాడా -

'ముసలి కంటిరెప్ప'
ముద్దు చెయ్యి తప్పకుండా
వీడి నిక్కర్లోకే వెళుతుందని తెలిసీ
వెళతాడు...
మళ్లీ చెయ్యి వెయ్యగానే కయ్యం...!

ఒక్కోసారి
మనుషులెవరికీ వినిపించని
మాటల్లేకుండా పాటలు పాడే 'మరుగుజ్జుల' మధ్యకెళతాడా -
బెకబెకలాడుతూ తనూ ఓ 'కప్ప'గా మారిపోతాడు....
కానీ
వాడి బెల్లం ఎవడన్నా కోసేస్తాడేమోనని మళ్లీ భయ్యం...!

ప్రతి పగలూ 'ఓపెన్ కాఫిన్' తీస్తాడా -
ఒక్కోరేత్రి కల్లో
కాఫిన్లోంచి లేస్తుందో గుర్రం ...
భయంకరంగా వేలాడుతూ
తన్ను తోసేసి
అమ్మ పక్కలో కెక్కుతుందేమోని మళ్లీ భయ్యం...!
ఒక్కోసారి ఒక్కో గుర్రానికి పదేసి తొండాలు...
ఒక్కో గోడ మీంచి దూకుతూ వెయ్యేసి తొండలు...
ఒక్కో పాము
కంత లోంచి చూస్తున్న
తన కళ్లలోకి కాటేస్తుందేమోని భయ్యం...!
భయ్యం...! భయ్యం...! భయ్యం...!

ముద్దొచ్చి ఎప్పుడన్నా
అమ్మ మంచం మీద పడుకోని
తన్ను పొట్ట మీదికి లాక్కొంటుందా -

ఆనందం గుండెలోంచి చిందుతుందా -
ఎక్కడో కనబడని చోటకూడా
రక్తం ఎగజిమ్మి
అమ్మ పొట్టకు రాసుకుంటుందా -
ఏం చేయదులే కానీ...
ఎందుకో ఎత్తి కుదేస్తుందేమోని భయ్యం....!
భయ్యం....! భయ్యం....! భయ్యం...!
కోపం...! కోపం....! కోపం...!
కసి...! కసి...! కసి...!
బల్బు పేలుతుంది...
తల పగులుతుంది...
పొట్ట చీలుతుంది...
అంతే...!

వాళ్లమ్మ డిన్నర్‌కి పిలిస్తే
ఓ రేత్రి వెళ్లానా -
అడుగు పెడుతూనే
వచ్చిపడ్డ క్రికెట్ బాల్‌కి దౌడ పగిలింది...!
మండుతున్న 'సూరీడి పిచ్చి జుట్లోకి'
ముద్దుగా వేళ్లు జొనిపితే
భగ్గని మండి ముఖం కాలింది...!
ఇక
వాడి తర్వాతి ప్రశ్నతో నా గుండె పేలింది -
'ఏ అంకుల్‌కి
పొద్దున్న నాలుగు
మద్యాహ్నాం రెండు
సాయంత్రం మూడు
గుర్రాలుంటాయి...?'

# యుద్ధమే పరమార్థం

ఎస్....

ఐ ఆల్‌రెడీ స్టార్టెడ్ యూజింగ్ మై హనీ
ఏ స్లీపింగ్ పిల్...!
గొప్ప నిజం ఏవిటంటే -
ఆవిడకూ నేనంతే...!
ఎవరికీ లేదు... ఈ అనెండింగ్ ట్రావెల్లో థ్రిల్ !

అలవాటు పడ్డాక
ఆడవాళ్లని సుఖపెట్టే ఆర్టేదో
అడ్డ గాడిదకైనా వస్తుంది కదా...!
అదే సుఖమైతే
పడడమే కాదు.... సుఖపెట్టనూ వచ్చు...
నిదర పట్టనూ వచ్చు... పట్టించనూ వచ్చు...!
అంటే

అంతా అయిపోయిందన్నమాటే కదా...?
ఏ(వీ సందేహం లేదు -
ఈ జన్మజన్మల బంధానికి
దేహం ఇంకా లేకపోలేదు....
కానీ ఆత్మే లేదు...
అంతే కదూ....?

గమ్మత్తేవిటంటే -
పాలల్లో పంచదార సంబంధాన్నే కాదు
అద్వైతం అన్ని బంధాల్లోనూ
కాస్తంత వెనకో ముందో అతుకు ఊడక తప్పదు లాగుంది...!
ఆ తర్వాత బతుకు
ద్వైతాద్వైతాల్లా తన్నుకు చావక తప్పదు...!
ఎందుకొచ్చింది -
అతుకు కన్నా తన్నుకు జావడ(వే మేలు కదూ...?

కన్నమ్మా...!
జీవితం అంటే ప్రశాంతి కాదు -
ప...పద...
లెటస్ సెలబ్రేట్ ది వార్....!

యూ ఫైట్ యువర్ వార్...
ఉయ్ ఫైట్ అవర్ వార్....!
ఆకాశం ఆరిపోతే మాత్ర(వే....?
పద కన్నమ్మా....!
'మారినెతీ' నడిగి మనం కూడా వెలిగిద్దాం -
'ఓ వెయ్యి వయొలెంట్ ఎలక్ట్రిక్ మూన్స్....!'

# ఏబ్‌స్ట్రాక్ట్ ఆడది

ఓ రేయ్...!

చక్కటి ఏబ్‌స్ట్రాక్ట్‌ని చూసి

మురిసి ముచ్చటగా మూడు నిమిషాలన్నా

మౌనంగా మీలోకి మీరెళ్లక

వెంటనే పిలిచి

'ఇదేంవిటి....?' అనడుగుతారేంవిట్రా...?

మంచి ఆడదాన్ని

కరుణించగానే
కౌగిలించుకోని తరించక
'ఈ తరుణి ఎవరు...!' అని ఆరాలు తీస్తారేవి(ట్రా...?

పోనీ
ఏ అదృష్టవశాత్తునో అనుకోకుండా ఆరగించినా
ఆ ఆత్మలోని అనుభవాన్ని
తిక్క వెధవల్లారా...! కక్కి..
తిరిగి
మీ పాచి నాలికల మీదికే తెచ్చుకోని
మీ రనుభవించిన రుచికే
అర్థం కోసం వెదికితే...
ఆ పిచ్చి ప్రయత్నం వ్యర్థం అయ్యి
మీ నోట్లోదే మీకు అసహ్యావయ్యి
ధుపుక్కున ఉమ్మేయక.... మరింకేం చేస్తార్రా...?

మీకింక
ఏబ్‌స్ట్రాక్ట్ ఆర్టెందుకు....?
అందమైన ఆడదెందుకు....?

పోస్ట్ పోయమ్ :

కన్నమ్మా....!
చరిత్రలెందుకీ వెధవలకి -
వర్తమానంలో బ్రతకలేని వాళ్లకి...!
కన్నమ్మా...! నువ్వే చెప్పావ్ -
వెన్నెల్ని అనుభవించాలే కానీ...
చందమామని అందుకోవాలని.... అనుకోకూడదని....!

# ఇసుక సమాధి

తెల్లటి ఇసుక రేణువులకి
నల్లటి ఆమె నగ్న శరీరపు అణువుల మీది మెరుపులకి
ఆట్టే బేధం నాకు కనపడ్డం లేదు....
ఆమె అందాన్ని
నా కళ్లు
ఇలా మైక్రోస్కోపులై శోధించినా
టెలిస్కోపులై దూరాల్ని సాధించినా
దగ్గిరకూ దూరానికీ బేధం అట్టే లేదు...

కాకపోతే ఆ సౌందర్యం.... దూరంగా చూస్తే
నైరూప్యమైన తెల్లటి ఇసిక తిన్నెలౌతోంది...
దగ్గిరగా చూస్తే ఆమె అందం
నల్లటి నిగనిగల నాగుబామౌతోంది..... అంతే !

మూర్ఖుడ్ని -
నాగరికత అంటే
ఎవరికీ తెలీని ఎడారిలో
నాకు నేనుగా
ఓ 'కాఫ్కైస్క్' సిట్యుయేషన్ని కల్పించుకోని
ఎవరికీ కనబడని పురుగుల్ని వేటాడ్డం అనుకొన్నాను...
పురుగుల ఎన్సైక్లోపీడియాలో
నా పేరు
పెస్టిసైడ్స్ పరిమళాల్తో చెక్కించుకుందాఁ వనుకున్నాను...
ఎంటమోలజీలో ఎవరికీ దూరడానికి వీల్లేని దూరాలకు
దేకుదాం అనుకొన్నాను...
కానీ...
కానీ....
దారి తప్పి
ఈ నల్లటి నగ్నంలో
ఎంతకీ దాహం తీరని ఎర్రటి నాలికగా
మారిపోతాననుకోలేదు...!

కమ్మటి నెత్తురు తాగడం ఎంత మధురం...!
కాలు జారి.... ఆకాశం అంచునించి
ఈ ఇసుక అగాధంలో పడిపోవడం కూడా
ముందు అంతే మధురం....!

కానీ.... ఎంత మధురమైనా
'లెట్స్ ఎంజాయ్ ఏ వీకెండ్ ఇన్ ద ఫామ్ హౌస్...!'
కాన్సెప్ట్‌తో
మా ఆధునికులకు... న...న్నాగరికులకు
దాహం తీరడం ఎంత సేపు....?

ఎంత మండు టెండల తాపమైనా
మండే మోణింగ్ కల్లా.... తీరి
చకచకా తిరిగి మా నాగరిక లోకంలోకి... చేరి
నో... నా నాగరిక బిలంలోకి దూరి
ఎస్.... ఎస్సెస్.... తిరిగి నా పురుగుల వేటకే
పరుగులెడదాం అని... తలెత్తి పైకి చూస్తే... చూస్తే....
తెల్లటి పొగలు కక్కుతూ... కిందికి దూకే
ఇసుక జలపాతం ...!
ఇసుక జలపాతం ....!
ఇక పైకి
జలపాతానికి ఎదురెలా ఈదను....?
పురుగుల ఎన్‌సైక్లోపీడియాలో నా పేరెలా సాధించను....?
నా అస్థిత్వాన్నంతా నవ్వులాట చేస్తూ
నన్నీ ఇసుక అగాధంలో నిలిపి
పక్కనే నేను నలిపి పారేసినా
జాలిగా నాలికలు జాపి
మెల్లిగా మెలికలు తిరుగుతూ... నా వంకే చూస్తున్న
నల్లటి నా నాగుబాము తప్ప కనబడే లోకం అంతా
చుట్టూ జలజలారాలే ఇసుక జలపాతమే -
ఇసుక జలపాతమే -
క్రూరంగా నా పొరల్నీ ఒక్కొక్కటిగా ఒలుస్తూ...!

నా ఒక్కో ఆశనీ... ఒక్కో ఇసుక రేణువుగా మారుస్తూ...!

సాక్షాత్తూ... తుఫానులో చిక్కుకొన్న
'లియర్నే' నేను...
'బార్డ్ ' పాడినా సరీగా అర్థం కానిది...
'కురుసోవా' చూపించినా హజం కానిది...
ఈ ఇసుక కూపంలో అనుభవమౌతున్నట్లుంది...
'ఎక్స్‌పోజ్ దైసెల్ఫ్ టు ఫీల్
వాట్ ౹రెచెస్ ఫీల్....!'

జస్ట్... రేణువు రేణువుగానే వొచ్చి తాకుతున్న
ఆ ఇసుక రాపిడికి
నా అణువణువుకూ అంటుకొంటున్న పొరలన్నీ
పొడిపొడిగా రాలుతూ ఊడిపోయాక... చేసేది లేక
నేనూ నగ్నంగా నిలిచాక.... నాకు వేరే దిక్కులేక
కేవలం దిక్కులేకే...
ఆ ఇన్ఫినిటివ్ అండ్ ఇంపాజిబిల్ స్పేస్‌లో
ఏ ఎక్స్‌ప్రెషనూ.... ఏ ఎమోషనూలేని ఏబ్‌స్ట్రాక్ట్ ఫేస్‌తో
తన వెంట కనీసం తన నీడకూడా లేకుండా
బ్రతికే
ఆ నల్లటి నాగుబామునే....
ఆ పామునే తిరిగి తల దువ్వాను...
అది తేట తెల్లనైన నిజం అని తెలిసీ కూడా
కలలో లాగే నవ్వాను...
ఇక చూడండీ -
చిటికెడంత చెలిమికే

చీకట్లో చిరుదివ్వెలా పగిలి వెలుగుతూ
పడగ విప్పుతూ
నా గుండె మీద చేరి
నా పాము ఆడిన ఆట... పాడిన పాట...
అద్భుతం...!
ఈ పిచ్చి పాము పిల్లలు
మనుషుల్ని ఎందుకు నమ్ముతాయో...!
ఎంత చంపి చర్మాలుగా మార్చినా
తిరిగి అందాల్నే ఎందుకు విరజిమ్ముతాయో ....!

ఎప్పుడన్నా... థార్ ఎడారిలో
కేవలం కాగడాల వెలుగులో
నల్లటి నాగుబాముల ఎర్రటి సుడిగాలి హేల చూశారా....?
శివుడి శిరం మీద
పదివేల రేకుల పసిడి పద్మంతో కదం తొక్కుతూ
ప్రళయ నృత్తం చేసే
ప్రచండ శక్తి నెప్పుడైనా ఊహించారా...!
ఒక్కసారి
నా పాము కాటు మాధుర్యాన్ని రుచి చూస్తే
ఎవరికైనా
తిరిగి తమ లోకంలోకెళ్లడం సాధ్యం కాదేమో...!
నా పాములాగే పచ్చటి పొడలు పొడలుగా
నా ఒడలంతా మారడాన్ని ఆపడం కూడా
ఎవరికీ సాధ్యం కాదేమో...!
తప్పదు -
నా సర్పానికి.. సర్వం సమర్పించక తప్పదు...
అందుకనే

నా నల్లని నాగుబాముతో అనేశాను -
'ఇక... ఇద్దరం కలిసి
ఈ ఇసుకని తవ్వి బ్రతుకుదాం...
లేదా
ఈ వెధవ బ్రతుకు బ్రతకడానిక్క్యాడా... ఓ పరమార్థంగా
ఈ ఇసుక రాసిని తవ్వుదాం...'
అని
నా తల
ఆమె పాదాల కింది ఇసుకలో కూరేశాను...!
మండిపడి చూస్తున్న నా సూరీడి కళ్లలో
కనీసం ఒకటన్నా పొడిచేశాను...!

దాంతో
ఇసుక రేణువులకీ
ఆమె శరీరపు అణువులకీ బేధం లేనట్టుగానే
ఉందనుకున్న
నా శరీరపు అణువులకి... ఇసుక రేణువులకీ కూడా
బేధం లేకుండా పోయింది....!
అద్వైతం అంటే ఏఁవిటో తెలీకుండానే
ఆమె మహామాయా తంత్ర యోగంలో
జీవితాని కర్థం
కేవలం ఈ అబేధఁవే అయ్యింది...!

మైక్రోస్కోప్‌లో చూసేవాడికి
అన్నీ అణువులుగాక
నిజంగా వున్నా... ఏ అందానికైనా అర్థఁవేఁవుంటుంది...?
పోనీ టెలిస్కోప్‌తో చూసినా
జీవితానికర్థం

గ్రహాలూ.... నక్షత్రాలూ కాక ఏం మిగులుతుంది...!
అనుకోకుండా రెక్కలొచ్చి
పోనీ.... ఈ ఇసుక జలపాతాన్ని దాటి
తిరిగి నా ఆకాశంలో కెగిరినా
నే తిరిగి చేసేది... పురుగుల వేటే కదా...!
నే సాధించేది
పురుగుల ఎన్‌సైక్లోపీడియాలో... నా పేరే కదా...!

చివరికి
ఈ ఇసుక సమాధిలో
మా మహాముద్రలో
అణువణువూ ఐక్యం అవుతూ
ఆత్మలు అణువులవుతూ
నేనూ
నా నల్లని నాగుబామూ... అంతే...
అంతే...
ఏ అర్థ(వూ లేకుండా
వ్యర్థంగా ఇద్దర(వే మిగిలా(వు...!

**పోస్ట్ పోయమ్ :**

కన్నమ్మా...!
రోజుకో నల్లని చుక్క
నా నాలిక మీద రాలుతూ... నే చావుని జయించాను
కానీ
నాకు తెలుసు... బ్రతకడం అంటే అది కాదు...
ఒక్క చుక్క నీ అమృతం తాగి
హాయిగా నన్ను చచ్చిపోనీ...!

# 'పెన్నీలేన్' రెవరీ

ఆ మె... అప్పుడే
ఓ రాతి కొండని బ్రద్దలు చేసుకు బైటకొచ్చింది...
శిథిలమై
రెక్కలు తెగిన గువ్వలా -
ఎస్..... క్లిషేడ్... బట్... రెక్కలు తెగిన గువ్వలాగే
నిశీధిలోకి అడుగుపెట్టింది...
ఆ తల్లిని
రెండు చేతులూ చాచి
గుండెల కత్తుకోడానికి లేకుండా
సిగ్గుపడి
అంత క్రితమే విషం తాగి... వెన్నెల సొంతం చచ్చిపోయింది....

ఎదురుగా.... చిరిగిన రెడ్ కార్పెట్‌లాగా
నిర్మానుష్యంగా... నిశ్శబ్దంగా
కేవలం కణకణకాలే కంకర రోడ్డు మాత్రమే

వెల్లకిలా పడుకోనుంది...
దాని రెండు సమాంతర రేఖలూ
ఓన్లీ హెవన్లో సెట్ చేసిన మారేజిలా
దూరంగా కలిసిపోయినట్టు కనిపించినా
ఆవిడికా గమ్యం
కొత్తగా తెలుసుకోవాల్సిన అబద్ధమేవీకాదు...
ఎంత నడిచినా పెరిగే
ఆ పగిలిపోయిన అద్దం మీద
అడుగు తీసి అడుగేయడానికి
ఆ రక్తపు ముద్ద తడబడుతోంది...

కానీ
చెట్టేలేని అచ్చోట
ఆ పగిలిపోయిన గుండెని
మరో లోకం నించి ఎగిరొచ్చిన.... ఓ పాల పిట్ట చూసి
మాటల్లేని మధురమైన పాటగా కూసి
ఆకాశంలోని అప్సరసల్ని పిలిచింది...
ఇజబెలే ఎజాని
నటాషియా కిన్స్కీ
మెలనీ గ్రిఫిథ్ .... అండ్
అనా కెరీనా... లాంటి రంగురంగుల రెక్కల స్త్రీలు
పరవసిస్తూ గాల్లో ప్రవహిస్తూ వచ్చి
'హాయ్...!' అంటూ ఆనందంగా అరిచి
ఆకాశంలోంచి
ఓ పూల ఉయ్యాల కిందికిసిరారు...

ఛటుక్కున చందమామ వెలిగింది...

ఆ చితికిపోయిన గువ్వచుట్టూ
చకచకా వసంతం విరిసింది...
నగ్నంగా.. మబ్బుల్లోంచి తేలుతూ
మెక్ కార్థీ...
జాన్ లెనన్... రెండు పక్కలా వాలారు...
చెప్పలేనంత ఆనందంగా... ఫెట్‌ఫట్ ఫట్‌పటాలాడబోయారు
కానీ
చకచకా గుడ్డలిప్పి పారేసి
తళతళలాడుతున్న పన్నెండడుగుల బాకా ఒకటి లాక్కుంటూ
'యోకో'
పరిగెత్తుకొంటూ వచ్చింది...
దాంతో 'కమ్ టుగెదర్' కాస్తా
'లెటిట్ బీ' మూడ్లోకి మారిపోయి
మెక్ కార్థీ ముడుచుకున్నాడు... కానీ
యోకో - లెన్నీ చేతుల్లోంచి... మూతుల్లోంచీ
మత్తయిన మంగళవాద్యాలు మొలిచాయి...
ఆకాశం నిండా పువ్వులు పూశాయి...
గొంతుల్నిండా కోయిల్లు కూశాయి...
ఇక ఆగలేక 'మెక్'
'అబే రోడ్' మీదకి మైక్ లాక్కొచ్చాడు...

రాగాను రాగాల మూర్తులు ముగ్గురూ కలవగానే
గాలికెప్పుడూ లేనంత పులకింత కలిగింది....
సంగీతం సలలితమై సముద్రం అయ్యింది...
అలల్లో తేలుతూ
ముగ్గరూ నగ్నంగా
ముడుచుకున్న గువ్వచుట్టూ చేరి

కేరింతలు కొడుతూ.... పాడుతూ... ఆడతూ....
ఆకాశంలోంచి నల్లటి ద్రాక్ష గుత్తుల్ని కోసి
మత్తయిన సంగీతంలో కలబోసి
కమ్మని కలల సెల్లార్లో
కనుమూసి తెరిచేంతలోగా.... కనీసం వందేళ్లు దాచి...
దాచి...
సడన్‌గా గుండెల్లోంచి బాటిళ్లు తీసి.... నో... చూసి
ముగ్గురు సంగీత మధువులూ
ఆవిడ చేత
తమ ప్రాణంలాంటి..... ఎర్రటి వైన్ తాగించారు..

ఆమె ఉయ్యాల
మధురంగా మబ్బుల్లో కూగింది...
కైపెక్కి
అస్తమించే సూర్యుణ్ణి
పకపకలాడుతూ కాళ్లతో తన్నింది....
ఉయ్యాల....
మైమరచి మైండ్ బోగ్లింగ్ వేగంతో
మార్వలస్ రెక్కలతో ఓ మదహాయంగా మారిపోయింది...
ఆకాశంలోకి రివ్వున రేగి
మరులుకొంటున్న
నడి సముద్రపు మెత్తటి అలల మీద తేలింది....
మరుక్షణమే మూడ్ మారి
మహోన్నతమైన మంచుకొండలమీద వాలింది....
మత్తు ముంచుకొచ్చేంతలోనే
మనసుని చిత్తు చేస్తూ
మలమలమాడే ఎడారిలో తూలింది....

ఏదో..... ఏదో... ఏదో.... జరిగింది
ఏవీ అర్థం కానంత వేగంగా....!
చిమ్మ చికట్లో కళ్లకేదీ కనబళ్లేదు...
తెల్లటి మెరుపుల్లోనూ కళ్లకేదీ కనబళ్లేదు...
కానీ.... కళ్లు కనబడేసరికి -
సలసలకాగే సముద్రం...
సడన్‌గా సముద్రంలో పట్టె మంచం...
ఎడారిలో పియానో...
బాగ్ పైప్‌తో ఒంటరి సైనికుడు -
నిలువుగా వున్న రోడ్డుని అడ్డంగా కత్తిరిస్తున్నాడు...
ఎవడు....?
ఎవడో....!

మళ్లీ గుండెలో ముళ్లజెముడు...
చీకటికి భయపడి స్విచ్ ఆన్ చేసినా
చంద్రుడు వెలగలేదు...
ఆదుర్దాగా ఆకాశం చింపి చూసినా
సూర్యుడు పత్తాలేడు...
పాదాలు నెత్తురు కారుకుంటూ
తెగించి
చీకట్లో ఆమె నడుస్తూనే వుంది...
అద్దాలు పగులుతూ కాళ్లకింది శూన్యం
నిశ్శబ్దంగా ఆవిలిస్తూనే వుంది...
దవడ పగలగొట్టబడ్డ రాతికొండ పళ్లు
దుమ్ములో పడి దొర్లుతూనేవున్నా
సిగ్గులేకుండా
కప్పల్లా మారి బెకబెకలాడుతూనే ఉన్నాయి....
గమ్యం ఎరగని నీటిచారలా

ఆమె మాత్రం నడుస్తూనే వుంది...!

**పోస్ట్ పోయమ్ :**

వెన్నెల కురిసి వెన్నముద్దగా మారి
ముడి విడకుండానే
నా గుండె మీద వాలిపోయిన
కన్నమ్మ
పది నిముషాలు కదలకుండా వుంటే -
నా గుండె మీది గుబురు
ఆ బుజ్జి ముక్కు పుటాల చిరువేడికి చెదురుతూవుంటే
చటుక్కున నిదరపోయిందనుకొన్నాను...
అలల్లేని సముద్రమనుకున్నాను...

కానీ
పదినిమిషాల పాతిక ఘడియల తర్వాత
సడన్‌గా తలెత్తి
'నిదర పోకుండానే కనే కల నేమంటార్రా....?'
అనడిగింది...
'గిల' అంటారన్నాను...
'నిజంగానే గిలగిల్లాడిపోయాన్రా
నీ గుండె మీద పడుకొన్నా గానీ...!' అంది...
క్షణం ఆగి -
'జీవితాన్ని ఇంత మితం చేసుకొన్నా
ఇంకా గతం వొదలదేమిరా....!'
అని కూడా అంది...

# ఛినమస్తాదేవి

కన్నమ్మకు పెళ్ళంట -
కలనుకున్నాను... కానీ నిజమే....!

రేత్రి పియానో మీద పడుకున్నానా -
లేవగానే
లేళ్ళు పరిగెత్తాయి....
ఇక చకచకా తలకు గులాబీరంగు వేసుకొని
గోతిలోంచి గిటారు తీసుకొని నిటారుగా నిలబడ్డాను...
తీగ మీటగానే తేళ్లు రాలిపడ్డాయి...
వేళ్లు
పిల్లపాములుగా పైకి పాకి పడగలిప్పాయి..

ఓ.... షిట్ !
ఎందుకు ప్రియురాళ్ల పెళ్లిళ్లనగానే
మనసులు కాట్ల కుక్కలౌతాయి....?
తన నీడతో
తడబడుతూనే రిజిస్ట్రారాఫీస్‌కెళ్లి

వాడి పావలా ప్రశ్నలకే పదహారు పళ్లూ రాలగొట్టి
పావు క్షణంలో బైటకొచ్చేసిందిట...!
తన నీడని
తన్ను ఫాలో అయితే
తాటవొలిచేస్తానని దూసుకొచ్చేసిందిట...!

యా... హూ...!
ప్రియురాళ్ల పెళ్లిళ్ల ప్లానులు ఫ్లాపవ్వగానే
మనసులెందుకు కొండముచ్చులౌతాయి...?

'షోపేన్'కి చెవులంకితం చేసిన
నా కన్నమ్మకు
తన అడుగుల నీడల మౌన సవ్వడిలో
' ఫ్యూనరల్ మార్చ్ ' వినపడలేదా....?
గ్రాంఫినాలేలోకి చేరుతుండగానే
నా 'మరియాబ్రాన్' కొంప కూడా కుప్పలా కూలిపోయింది కాబోలు -
మన లోకల్
'మరియా మీస్‌లు... జెర్మన్ గేర్‌లు' రోకలి బండలతో
తన ఫ్యూనరల్ మార్చ్ ఫినాలే రెవరీలో
కళ్లెర్రజేసి కనబడివుంటారు కట్టగట్టుకోని....!
తిరిగొచ్చి నెత్తి కొట్టుకొనుంటుంది -
గడ్డకట్టుకుపోయిన తన ప్రవాహాన్ని తన్నుతానే ఓ నెట్టునెట్టుకొని...!

అలా కాని పని... కాగూడని పని నించి
ఇంకా నిజంగా చెప్పాలంటే.. ఓ కుక్కకాటునించి
ఓ కమనీయమైన కాంత ' సేవయ్యిందిలే పోనీ....' అని
నాయకమ్మణులు ఆనందించి వుంటారు....

కానీ
వాట్ యన్ ఐరనీ -
నా కన్నమ్మ సేవయ్యిందని
నేనూ ఆనందించాను కదా....!

ఇక
కన్నమ్మ కన్ఫ్యూజన్లో ఎందుకు పడదూ -
తన కల విరిగి... నో... తనే విరిగి
సరిగ్గా రెండు ముక్కలైపోయినప్పుడు...!

ముందు నా ముక్క నే నోట కరుచుకోని
కన్వీనియంట్గా దౌడు తీశాను...!
కానీ
కమాన్.... కమాన్.. కమాన్మంటూ
తమ పక్కకి రమ్మని
ఆకాశంలో బారుతీరి కూర్చున్న ‘ సప్తమాతృకల ’ వరసేమో
మహత్తరమైన ...... మహిమాన్వితమైన.. మార్వెలస్గా మండుతున్న
తమ బంగారు తాళ్లు కిందికి వేసి
ఆకాశంలోకి
నా కన్నమ్మ కాలునో... చెయ్యినో
దొరికినంత చేదుకోవాలని
ఎంతో దయతో
ఇంకా తంటాలు పడుతూనే ఉన్నారు....!

ఇప్పుడర్థమైంది -
అంత భీకరంగా ఆ తాంత్రిక శక్తి తల
రెండుగానో... పన్నెండుగానో
ఎందుకు చీలిపోయిందో ....

# అసంపూర్ణ గీతమే కానీ...!

'షూ్యబర్ట్' ని తీసుకోని సమాధిలో కెళ్లానా -
ఆ 'ఎయిత్ సింఫొనీ' అసంపూర్ణమైన ఆర్గా[illegible]
చికాకుపడి నా కన్నమ్మ
చటుక్కున పైనించి లేచిపోయింది....
నా గుండె ఆగికూడా
నేనింకా ఎందుకు బతికున్నానో ఆ క్షణం అర్థం [illegible]...

ఆకు ఎర్రబడినప్పుడు
ఆకాశం అరిచి లాభంలేదు...
ఏరు కదలడం మానినప్పుడు

గాలి వీచి.... ఎన్ని వెధవ్వేషాలు వేసీ లాభం లేదు...
పొంగుకొచ్చే సూర్యుణ్ణి కాస్తంత కోప్పడి... లేదా
మోచేత్తో పొడిచి వెనక్కి... వేచి కూచుంటే
తర్వాత
విరవమన్న చోటల్లా విరిచి
చందమామని
మహామధురంగా తగలబెట్టొచ్చు...!

ఈలోగా
చక్కటి పసుప్పచ్చటి చెట్ల చంకల్లో
పాల పిట్టలు గూళ్లుకట్టి చక్కిలి గింతలు పెట్టవా...?
లూజుగా మబ్బుకుచ్చిళ్లు
కిందికి జారిన ఎర్రటి ఆకాశం నాభిలో
నలభైవేల గాలి నాలికలు
సుడులు తిరిగి పచ్చి పరాచికాలాడవా....?
పిచ్చెక్కి కోటి పసిడి పిడుగులు
చివరికి చేతులెత్తి కచ్చిగా
'హరోంహరహరా....' అంటూ వెన్నెల జలపాతంలోకి దూకవా...?

చాలు -
అసంపూర్ణ గీతమైనా ఎంత మధురం...!
నో ప్రాబ్లం ......
ఆ ఆగిపోయిన 'ఎయిత్ సింఫొనీ' ని
ఇక పగిలి
నేను పూర్తి చేస్తాను...!

# కామగానం

అవును...

అలలంటూ వుండాలే కానీ
అందానికి వెన్నుపాములో అంటిపెట్టుకునే
కామం వుంటుంది...
కమ్మగా వుండడమే కాకుండా
కామానికి కదం తొక్కే కాలిగిట్టలుంటాయి....
పల్చగా... పిరుదుల మీదే కాక
నా 'కామేశ్వరి' కి
మోకాళ్ల మీద కూడా వెంట్రుకల కుచ్చులుంటాయి....!
కళ్లు చీలుస్తుంటాయి....!
గోళ్లు నెత్తురు పీలుస్తుంటాయి...!
సో... వ్వాట్...?

హాయిగా... కళ్లు మూతలు పడడం అంటేనే
కొందరులిక్కి పడతారెందుకు...?
వాళ్లనో కొలిక్కి తగిలించి
మనం కొలిమిలో కాలితే కాలుదాం...
మాడితే మలమలా మాడుదాం...
అని
మన మానాన్న మనం బ్రతకడానిక్కూడా లేదు కదా...!
చుక్కల చుట్టూ కుక్కలే కదా....!

ఓసీ... సెలిబసీ...!
నీ మారు పేరేకదూ హిపోక్రసీ...!

కట్టుదెంచుకొని ఒక్క సారిగా రక్తం పరిగెత్తి
మా నాళాలు... నరాలూ... కాసెపు గిలగిలా కొట్టుకోని

సముద్ర గర్భంలోని మహాపర్వతం ఫటేలున పగిలి
చివరికి
మా ప్రాణవాయువుల్ని మత్తు మేఘాల మీద మధురంగా తేల్చే
మా పరాకాష్ట ఫలంతో
నీ ఆత్మవంచనల అమలిన కవచాన్ని
బ్రద్దలు చేయడం పెద్ద కష్టవేవీ కాదులే.... కానీ
భయం అల్లా
నీతో.... అనవసరమైన యుద్ధం గురించే...!
నడుం వరకే చిరత పులులుగా మారిన
మా పసిపిల్లల్ని
పొట్టకు కట్టుకు పోరాడ్డం ఎలా అన్నదే...!
అసలు.... పోరాటం ఎందుకు అన్నదే...!

యుద్ధం వద్దన్న వాళ్లందరూ
పిరికి వాళ్లనుకుంటున్నావు కదూ...!
కామం అంటేనే స్నేహం...
స్నేహం అంటేనే శాంతి...
మేం శాంతి కాముకులం...
యుద్ధ వినాశకులం...
'నో సెక్స్ ప్లీజ్...! ఉయ్ ఆర్ సెయింట్స్....!'
అనే వెధవలతో
అసలు యుద్ధం ఏవిటి...?

ఇప్పటికి
ఇక్కడి మా 'వాసనల వనాన్ని' నీ కొదిలేస్తున్నాం...
మేం ఎక్కడ అడుగేస్తే అక్కడ
మంచి గంధం మొక్కలు మొలుస్తాయి కనుక...!
మత్తు కోయిలలు కూస్తాయి కనుక...!

కాబట్టి
మేం ఓడిపోకపోయినా
నీకు దూరంగా వెళుతున్నాం...!

యుద్ధానికి దూరంగా నడుస్తూ
నేను
'నడుందాకా మదపు గుఱ్ఱం' గా మారిపోయాను...
నా 'కామేశ్వరి'
తన సగం చిరుతల్ని చంకనేసుకొని
ఛటుక్కున నా వీపుమీదికెగిరి నిలుచుంది...
మాలోని 'తియ్యటి రాక్షసులు'
తింటూ... తాగుతూ... తూగుతూ... ఆడుతూ... పాడుతూ.
చిందులేస్తూ మా వెంటసాగారు...!

యుద్ధానికి దూరంగా
ఈ మా ప్రయాణం పలాయనం కాదు...
చివరికి
మరణం కూడా
మా కామ జీవులకు అంతం కాదు...!
మా అందం మేఘమై
మా కామం కాలి గిట్టలై
మళ్లీ మళ్లీ పుట్టక మానవు...!
సృష్టించడమే మా హక్కయినప్పుడు
మమ్మల్ని ఎన్ని జన్మలని చంపుతావు...?

ఓసీ...! సెలిబసీ.....!
నీ మారుపేరే కదూ హిపోక్రసీ...!

# గ్రేట్ కన్ఫెషన్స్ ఆఫ్ వైల్డ్ గేమ్స్

"మనలో గడ్డకట్టిన సముద్రాన్ని
పగల గొట్టగలిగే గండ్రగొడ్డలి
ఒక్కో పుస్తకంలో వుంటుం"దంటాడు... కాఫ్కా
కానీ...
ఒక్కో స్త్రీలో వుంటుందనుకుంటున్నాను నేను...!

యధాప్రకారం నా కన్నమ్మ పేరే ముందెత్తు తాను...
అయితే... ఈ కథలో ఆవిడితో పాటు
మావిడంచు చీర కట్టుకోని
ఓ చిరుగండ్ర గొడ్డలి చేత బుచ్చుకోని
చెరుకు ముక్కలాంటి తియ్యటి
చేతితో తాకితేనే కందేటి
ఇంకో కుందేటి కూన కూడా వుంది
ఆబ్వియస్లీ...!

నిజానికి
కుందేటి మాంసం నాకెప్పుడూ నచ్చదు -
ఎంత నా కన్నమ్మ వండి పెట్టినా...!
తన నోట్లోంచి నానోట్లోకి నాలికతో కుక్కినా...!
కానీ ఏం చేయను -
పెద్ద పెద్ద సూర్యుళ్లే
నోళ్లు మూసుకోని ఆరిపోతున్న పరీక్షా సమయంలో...!

పసుపులేటి పూర్ణచంద్రరావు

బిక్కుబిక్కుమంటూ తల వొంచుకున్నా
నా శివుడి మీద తన్ని
ఆవిడ వెళ్లిపోతున్న తీవ్రమైన తీరుపు సమయంలో...!

"తిను...
నా కొడుకా తిను...
కుందేటి మాంసమే తిను..." అని
శిక్షని
నా కన్నమ్మ నా నోట్లో కుక్కిన సమయంలో ఏం చేయను ?
పాపం...
ఆ కుందేటి కూన మాత్రం ఏం కాను...?

ఇంతకీ జరిగిందేమిటంటే -
జస్ట్ రెండు రౌండ్ల కళ్ల ఎర్రబారుడు లోంచే
తెల్లబోయి చూసేలా
ఎందుకొచ్చిందిట -
పదిన్నర దాటినా పుస్తకాల గదిలో చదువుకుంటూ వుండాల్సింది -
నా గదిలోకి...?

'లైక్‌టు హేవే డ్రింక్...?'
అన్న మర్యాద మాటే తప్పయితే
ఎందుకు గుచ్చుకున్నదట -
మంచురాళ్ల మీంచి జారవిడిచి
మూడున్నర ... రా... తన గుండెల్లోకి..?
ఆ తర్వాత ఎందుకు విచ్చుకున్నదట -
ఆకాశం చివర ఆ పిచ్చి కమలం
సరాసరి నా కళ్లల్లోకి...?

అయినా సరే
నేను మండి మసిబొగ్గుని కానని
ఎందుకు కాసిందిట నా కన్నమ్మ
సరిగ్గా నా గిలక మీదే గిచ్చు పందెం...?
ఖచ్చితంగా
ఖచ్చితంగా తెంపి
చేతికిచ్చేందుకేగదా నా జంద్యం...?

మీరే చెప్పండి -
శీల పరీక్ష ప్రారంభించింది
నేనా... నా స్త్రీయా....?

ఇంతకీ ఏంటట -
ఓస్లీ.. నా ఆకు ఊడబెరికి
పారిపోయి రమ్మని చెప్పిందిట....!
ఎంత ఇబ్బందైనా
అందాలు చిందేటి ఆ కుందేటి కూనని
తన అద్దాన్ని మాత్రం పదిలంగా వుంచుకోమని
చేతిలో చెయ్యి వేయించుకోని మరీ
ఆరి చెయ్యి గిచ్చిందిట....!
గిచ్చే ముందు
నా కోసం కొట్టుకుంటున్న తన నిండైన గుండెల్ని తెరిచి
ఓసారి చూపించిందిట....!
వెను వెంఠనే తన అహం జారిపోకుండా
తిరిగి ఛటుక్కున చీరకొంగుతో కప్పిందిట...!
చెప్పిందే పన్నెండు సార్లు చెప్పిందిట...!
తాకితేనే కందేటి ఆ కుందేటి కూన
ఒప్పుకున్నట్టుగానే అర్ధరాత్రి నా గదిలోకొచ్చి

ఆకలిగా నాతో పాటు
నాలుగు రౌండ్ల ఎఱ్ఱటి చీకట్ని తాగి
కమ్మటి కబుర్లలో ఊగి... తూగి... తూగి.. ఊగి..
సడన్‌గా ఆగి
ఊడబెరకమన్నది మాత్రం
పగలబడి నవ్వుతూ మహా అద్భుతంగా ఊడబెరికింది...!

తర్వాత
తన అద్దం చేత బుచ్చుకొని
తుఱ్ఱున పారిపోవడం కూడా పారిపోయింది..... కానీ
సగం దారిలో
సెల్ఫ్ గ్లిటరింగ్ గిల్ట్‌లో పడిపోయిందిట... పాపం !
కణకణా కాలిపోతూ.. చిరురెప్పలు వాలిపోతూ
ఎఱ్ఱటి తన కన్ను పడుతున్న గరగరల్ని
క్షణం ఆగి తనలో తాను చూసుకొందిట...
ఆమె అద్దంలోనే ఆమె ముఖం బదులు
ఆకు ఊడిన నిజాన్ని ఎలా కప్పుకోవాలో తెలీక
నొప్పులు పడుతున్న నా బొమ్మ కనపడిందిట...!
అప్పుడు ఆ రెమ్మయున్ కలవరపడిందిట...! అంతేనా...?
బరువైన ఆమె రెండు గుండెల్లోనూ ఏదో చప్పుడు కూడా
వినపడిందిట...!

నాకు కనబడని... వినబడని ఈ కథంతా కూడా
నా అమావాస్యలోనికి రాగూడని
చందమామే తిరిగొచ్చి -
'బుషే' బ్రష్ చేసిన రంగురంగుల అలల్లాగా
ఖుషీగా నా కడలి మీద తేలుతూ.... తూలుతూ
ఆనక ఆవిడే ఆనందంగా కన్ఫెస్ చేసింది...!

చేస్తూనే తన చిరుగంట్ర గొడ్డలితో
నా శివం మీద మధురంగా ఒక్కవేటు వేసింది...!
హే....! నా టోస్లీ మీ....
సర్టెన్ బ్యూటిఫుల్ బనీస్ ఆల్సో కన్ఫ్యూస్... యూసీ...!
గ్రేట్...!
ఆ తర్వాత కథ మామూలే.... స్నిఫ్...! స్నిఫ్....!
నా ఒంటి మస్క్‌లోని మార్పు
పిసరంత మంచి గంధం చేర్పు
నా కన్నమ్మ బుజ్జి ముక్కు పసిగట్టేయగానే... గానే...
'యూ... బ్లడీ... ప్రెటెండింగ్ వెజిటేరియన్ బాస్టర్డ్...!
నేను ఒండి పెట్టినంత మాత్రాన్న
కుందేటి మాంసం ఎందుకు తిన్నావురా...?'
అని
అంత వరకూ మధురంగా చిటపట చినుకులు కురుస్తున్న
నా అల్టిమేట్ ఆనందం రోసి
తన మాగ్నిఫిషెంట్ మబ్బుల రెంటినీ
షాక్ తిన్న నా శిఖరం మీంచి లాగి పారేసి
స్విచ్ వేసి
ఎర్రటి సూర్యుడ్ని సరిగ్గా నా ముఖం ముందు వేలాడదీసింది !
అప్పుడే
తన తియ్యటి పెదిమల్నించి వేరు చేసిన
నా మూతి మీద ఓ గుద్దు గుద్ది
జలజలా కారుతున్న తన కంటిని ఒక్క రుద్దు రుద్ది
లేచి
చకచకా సముద్రంలోకి నడిచి వెళ్లిపోయింది...!

అలా గడ్డకట్టిన సముద్రాన్ని
ఆరు నెలలైనా కూడా నేను కరిగించలేకపోయాను....

నా బాధ చూడలేక
నా కుందేటి కూన... నో.. ఆవిడి కుందేటి కూన
ఎంత అద్భుతంగా వేసిందంటేనయ్యా... మరో వేటు...
తన చిరు గండ్ర గొడ్డలితో నంటే -
ఆ వేడి వేడి వేటుకు
మంచుకొండ మాటల్లో చెప్పలేనంత మధురంగా పగిలింది...!
సలసలా తిరిగి సముద్రం పొంగి కదిలింది...!

ఇంతకీ ఏం చేసిందంటే -
అదర గొడుతూ ఆరడుగుల రెండంగుళాలుండేటి
తన జంట కుందేటి కొమ్ముగాడ్ని
చెవిలో ఓ కమ్మటి ముద్దుపెట్టి
కథకు క్లైమాక్స్‌గా
చక్కటి సీనొకటి రాసి పెట్టి
'చెంచీ'గా తను వెళ్లాల్సింది
తన 'చెంచా'ని నా కన్నమ్మ వెంట పంపింది -
ఒంటరిగా ఒరిస్సా...
కావల్సిన మసాలా అంతా నూరించి కసాపిసా !

ఇంతకీ ఎందుకంట...?
అతి ఎక్కువగా అరిచి
అతి తక్కువగా పని చేసే ఓ విమెన్స్ గ్రూప్‌ని
ఎవాల్యుయేట్ చేయడానికట...!
నా మీదలిగాక
నా కన్నమ్మ వెంట
లగేజీ మోసే గాడిదెవడూ దొరకకట...!
కట కటా....!

ఇక అటుకొసన -
కోరకున్నా కోటి కోరికల్ని రగిలించే కోణార్క
కరుడు గట్టిన ఆవిడి సముద్రం క్రింద
ఎంత మంట పెట్టాలో అంత మంటా పెడుతోంటే -
ఉప్పుకొండ ముందు చిటపట మంటూనే
తరవాత... ఎంత కరగాలో అంత కరిగిపోతోంటే -
'ఓ షిట్...!
వై యామై స్లిపింగ్ లైక్ దిస్...!'
అనుకొంటూనే స్లిపయిపోయి...
'ఓ కమాన్...!
ఫస్ట్ టైం దటయామ్ స్ట్రెచింగ్ లైక్ దిస్...!'
అనుకొంటూనే స్ట్రెచయిపోయి...
'ఓ నో..!
దిసిల్ బి ది లాస్ట్ దటయామ్ కమీటింగే సిన్...!'
అనుకొంటూనే సిగ్గు పడిపోయి...
మూడో పెగ్గు పడగానే
వెన్న ముద్దలా మూడుచుకోబోయి
వెన్నెల రేయిలా వెచ్చగా విచ్చుకుందిట...!
కున్నాక..
' సరే కావీ...' అనుకొని
ఓ వెనకటావిడిలాగా
'ఆకాశంలోంచి ఓ మబ్బు పింజని లాగి తలకింద పెట్టుకోని'
టుబీ ఆర్ నాట్టుబీ... టుబీ ఆర్ నాట్టుబీ... టుబీ ఆర్ నాట్టుబీ...
అవి జపించిందే గానీ
ప్రమాదంలో పడటానికే తపించిందట....!
అలా పించి ... పించే.. శపీ మని
రుభీ.. మందట !

సరిగ్గా మూడు రోజుల రుబి .....రుబీల తర్వాత
కోణార్కలో మూసుకున్న కళ్లు
నా కన్నమ్మ భయంభయంగా భువనేశ్వర్లో తెరిచేసరికి -
ఛళుక్కున
తెల్లటి తన గండ్ర గొడ్డలితో
నా.... నోనో... ఆవిడి... నోనోనో ... అతగాడి
కుర్రకుందేటి పిల్ల
పరుచుకొని పడుకున్న నా నగ్న దేవత మీద
అటో కాలు... ఇటో కాలు వేసి
నవ్వుతూ నిలబడిందిట... ఠ !

ఆ తర్వాతేనాటికో.. ఆంధ్రదేశంలో
ఆకాశం నించి మధురమైన మబ్బులు
సరాసరి నా ముఖం మీదికే దిగుతున్నపుడు
ఛటుక్కున నా చెవి కొరికి
అప్పుడు చెప్పింది -
ఎవరు... ?
కొంటె కుందేటి కూన కాదు...
కసిదీరి... నా కన్నమ్మ...!

పోస్ట్ పోయమ్ :

ఉరేయ్...! తోటి మగవెధవలూ..!
కన్ఫెషన్సంటూ చేయాల్సివస్తే
ఈ కుందేటి కూనలు
కమ్మటి పళ్లు వేలాడే కొమ్మలూ చేసినంత మధురంగా
మనం చేయలేం లేరా...!
మనవుత్తె దొంగ వెధవలవే లేరా...!

# కాట్‌గాళ్

వ ల్ల చిరుత
'నటాషియా కిన్‌స్కీ' కళ్లలోని
కామపు విస్కీనిషా ఒహలెక్కకాదు
నా లయెనెస్
కళ్ల కొనల చిరువేటు ముందు...!
చిరుత
గుండె చీల్చేయడవే...
కసిగా వచ్చి దూకితే
పచ్చి నెత్తురు తాగేయడవే...!

నా
'ఢాకినీ' అధిరోహిత
మంత్రయుక్త మహిమాన్విత
'మహాపద్మ ముద్రా' బంధిత
మధురమైన
ఆ పురుషాయిత మహా యజ్ఞం తర్వాత
నే
చిత్తుగా.. మత్తుగా
ఆ ఎత్తయిన రెండు విప్పు ముద్దల క్రింద
సొమ్మసిల్లి పడిపోయినప్పుడు
అంత మత్తయిన పెదిమల అంచున

పసుపులేటి పూర్ణచంద్రరావు

ఛటుక్కున నెత్తుటి కోరలు ఎలా వెలిశాయో...!
అంత మెత్తని వేళ్ల చివరన
కత్తులగోళ్లు ఎలా మొలిచాయో...!

నా కన్నమ్మ
కమనీయమైన కాట్‌గా మారి
నన్నామె వైల్డ్ బైట్‌గా కరుణించి
తన సృష్టిస్థితిలయ న్యాయంగా
కసుక్కున నా గొంతు కొరికితే
అంతకన్నా అదృష్టం ఏఁవుంది...?
నా తల తెగి
మెడనించి నెత్తురు చిమ్మి
నా కాళి -
నా కన్నమ్మ దాహం తీరితే
అంతకన్నా ఈ జన్మకు తాంత్రిక ముక్తి ఏఁవుంది....?

నిజానికి
నాకు మాత్రం అంతం అంటూ ఎక్కడిది....?
నా కన్నమ్మ గర్భంలో
సుళ్లు తిరుగుతూ పెరుగుతున్న... నా బీజం
మరో ఘడియలో
ఆ కమనీయమైన కన్ను చీల్చుకోని
తిరుగులేని మరో తేజంగా
తిరిగి జన్మించి
నా నెత్తురుతో తడిసిన
నా కన్నమ్మ కాళ్లమీద పడబోతోంటే....!

# కుఁయ్...! కుఁయ్...!

నీ చెక్కిళ్లు ఎరుపెక్కే వేళ
నా ప్రవాహం నీ మెట్ల మీదుగా పొంగి
'ఫ్రాగోనా' లాగా
నీ గదిలో దూరి 'బోల్ట్' ఎందుకు పెట్టలేకపోయిందో తెలుసా...?

కళ్లు మూసుకొని కర్ణపేయంగా
'ఇసాక్ స్టెర్న్' రమిస్తోంటే కూడా
'బ్రాహ్మ్స్' వయొలిన్ కాన్సర్టో కాదూ కూడదూ అని
నా కాళ్లకు చుట్టుకొని ఆపితే ఏం చేయను..?
సరే -
ముందు నా వేళ్లు
ఆ వెన్నెల తీగల్నన్నీ తనివితీరా మీటనీ అని
అక్కడే నా ప్రాణం కాసేపు ఆగింది...
మెల్లిగా నెలవంక
నెత్తి మీది నించి చల్లగా అవతలివేపుకు సాగింది....
డాళింగ్...!
ఒకేసారి
రెండు దారులా నడవలేను కదా...!

మాంఛి మదించిన మస్క్ చీలుస్తున్న మగ వాసనలతో
~~ఈ~~
మోస్ట్ రొమాంటిక్ ఎక్స్ప్లనేషన్
నా నాలిక మీది నించి
మేలు జాతి జర్మన్ షెపర్డ్ హౌండ్ లాగా
నిరంతరం కారేది...
నా ఆత్మవంచనల సొల్లుకు
ఆమె తెల్లటి వెన్నెల మాధుర్యం
నిరంతరం ఎర్రటి కన్నుల కాఠిన్యంగా మారేది...

అయినప్పటికీ
'ఐ కాన్ట్ హెల్ప్' అనుకునేవాడ్ని...
నడవలేనంటూనే
నిరంతరం రెండు దారులా నడిచేవాడ్ని...!

మగ హిపోక్రసీని... పోనీ... నా హిపోక్రసీనే
రెండు తలల పాము లాంటిది అందాంవా...?
మరి
రెండు తలల్లోనూ రెండేసి నాలుకల్ని....?
రెండేసి నాలుకల్లోని పన్నెండేసి చీలికల్నీ...?
మన నిజం.... పోనీ... నా నిజంవే
నల్లగానే వున్నా
అవతలి పక్కకూడా నిజం
అంత తేట తెల్లంగానూ లేదు మరి...!

'బాన్' నించి రాలిపడ్డ
ఓ తెల్ల బాలభానుడ్ని -
తన చుట్టూ
పన్నెండు కుక్కపిల్లలు 'కుంయ్యీ.... కుంయ్యీ...' మంటున్నా
వాడి చెవులకు వినపడకుండా
తన ఒళ్లో వేసుకోని జోల పాడిన జోరు....
వాడి కళ్లు కనబడకుండా
తన కొంగు కప్పిన తీరూ...
చూస్తే
ముందు నోరు తెరిచి
ఆనక 'వారేవా...!' అనిపించి...
అలా అనిపించాకనే కదా
నేను సైతం వేంఠనే -
ఆవిడి పదమూడో కుక్కపిల్లగా మారిపోయాను...!
కుంయ్...! కుంయ్...!

# గొంతులో పొడిచినా....!

నో ....!

నేనడివిలో ఆకుల్లాగా అల్లల్లాడలేను...
'మోర్జాట్' తో ఈ మూల
నా గుండె గాల్లో తేల నివ్వండి...
నాలోనే వెన్నెల చెట్లు మొలవనీయండి....

ఆ(....! ఎక్కడ పొడిచావురా నన్నూ...?

అవును...
ఆకు(రాలినప్పుడు నెత్తుటి చారలు కనపళ్లేదు...
నీ కత్తితో
నా నరాల్ని లాగినప్పుడు కూడా
వయోలిన్లేపీ వినపళ్లేదు...

నాలో నిశ్శబ్దం ఆవిలిస్తోంది....
నవ్వుతూ పగలాల్సిన 'నలభయ్యో సింఫానీ'
తీగ తెంచి
అవును... 'సలీల్ చౌధురీ' ఎత్తుకు పోయాడు...!
కానీ అంతెత్తునించి పడి నవ్వుతూ తల పగలడం
'తలత్ మెహమూద్' కి సాధ్యం కాదు...!

ఏం చేయను...?
నా గొంతులోనూ జలపాతం ఎండిపోతోంది...
నీ పెదిమల్ని మీటిన వేళ్లు చిట్లి
నాలో మిగిలిన నెత్తురు కాస్తా కారిపోతోంది...

కన్నమ్మా...!
పగలంతా ఆపుకోని
వెచ్చగా తగలగానే... నీ వెన్నెల్లోకి కళ్లు తెరిచినా
కనీసం ' కుందన్‌లాల్ ' కూడా వినపళ్లేదు...
కళ్లలో సముద్రం ఎండినా
గుండెలో మిగిలిన నీ ఒక్క బొట్టు సంగీతాన్నైనా
దాచుకుంటూ బతుకుతున్నానే -
ఆ ఒక్క నెత్తుటి చుక్కనీ
నిర్దయగా నాలికతో అద్దుకోకు...!
గొంతు తెగినా
స్వరం గాల్లో తేలి తన్నుకుంటున్నానే -
ఆ చివరి తీగని కూడా లాగి... తెంపేయకు !
కన్నమ్మా... నన్ను చంపినా
నిన్ను నా గీతంలో బ్రతకనీ..!

# 'జొకాస్టా'తీతం

మబ్బుల్లో మధురంగా పరుగిడుతూ.. మరుక్షణం
'అమ్మో...!
నా ఇడిపస్ ఎంతేడుస్తున్నాడో...!' అంటూ
ఆకాశం లోంచి పాతాళంలోకి హాయిగా పడిపోయే
నా పిచ్చి ప్రేయసికలా
పాలు పొంగడం పాత అలవాటే...!

పాపం... జొకాస్టాకు నిజం తెలియదు...
నా ఎల్లమ్మకేమో అబద్ధం తెలీదు...!

ఆ జగజ్జనని
తన కన్న పిల్లలందరికీ
గుచ్చి పాలిచ్చి పొట్ట నింపడమే కాదు -
విచ్చి వెయ్యి కన్నులిచ్చి మరీ జన్మనింపుతుంది...
చీకటినీ... కాంతినీ
రెండు వలయాల్నీ ఏక కాలంలో ప్రసవిస్తుంది...!
అలా
సూర్యుడ్నీ.. చంద్రుడ్నీ కలేసి
తన చిటికెన వేలితో తిప్పడమే కాదు
కాలుడ్ని సైతం
వాడి జన్మ స్థానంలోనే జన్మరాహిత్యాన్నీ
వాడి
నల్లటి బుగ్గ మీద చిటికేసి మరీ ప్రసాదిస్తుంది...!
తన పిచ్చి ప్రేమకు
అదీ అంతం లేదని ప్రవచిస్తుంది...!

పాహిమాం...! పాహిమాం...!

# ఇన్‌ఫెంట్ హామ్లెట్

ఓ సారి పిచ్చి బాలుడు
కచ్చగట్టి
గప్ చిప్‌న సముద్రాన్ని ఆడుగునించి దాటేసి
పశ్చిమాన ఉదయించబోతే
కన్నమ్మ అరిచి గీపెట్టి
తన కంటి రెప్పని పట్టి పీకేయబోయింది...!

కసిరి
ఆ చక్కటి కళ్లని
ఆవిడి వాణికే పిచ్చి వేళ్లనీ
మృదువుగా ముద్దుపెట్టుకున్నాను...
చల్లబడి
ఆ పది పసిడి గోళ్లు
పండు వెన్నెల్లా పకపకానవ్వి
ఆనక
ఆవిడి అగ్నిపర్వతం చల్లారి
చక్కటి సముద్రుడి అలల్లో హాయిగా తేలుతున్నప్పుడు
చిక్కటి ప్రేమతో నా వీపులోకి గుచ్చి
చెవిలో
ఓ సృష్టి చమత్కారాన్ని అప్పుడు చెప్పింది ఆ పిచ్చి తల్లి...
" నేనేం చేయన్రా ?
ముద్దొచ్చి నా కనుపాపని
కాసేపు కడుపు మీదికి లాక్కుంటానా -
గుండు సూది గుచ్చుకుంటుంది..!
చాచి లేత తమలపాకు మీద చరిచి
ముల్లు విరిచేయబోతేనేమో నొచ్చుకుంటుంది...!"

పిచ్చిపిల్లా !
ప్రకృతి నగ్నంగా వుండక
పాంటూ చొక్కా వేసుకొంటుందా...?
కానీ ఖర్మ -
ఈ మురికి మనుషులున్నంత కాలం
వేసుకుంటుంది...!
నువ్వు మాత్రం పట్టించుకోకు...!

# సెవెనియర్ ఇచ్

ఆ పిల్ల సుడిగుండంలో
కళ్లు తిరిగి కాదుగానీ
ఆవిడ నన్ను తిప్పిన తిప్పుడ్లోని
'లూబిట్స్ టచ్ ' వల్ల పడిపోయాను...
నిజంగా నాకది
ఏ లా 'బిలీవైల్డర్స్ సెవనియర్ ఇచ్ '...!

పరిచయం అయిన పది నిమిషాల్లోనే
'యూ బాస్టెర్డ్...!' అని
నా వీపు మీద ముద్దుగా గుద్దింది...!
నా పర్స్‌లోంచి పైసల్తీసి
తన ఫ్రెండ్స్ అందరికీ - అఫ్‌కోర్స్... నాకూనూ -
' పూర్ మాన్స్ పబ్ 'లో
బీర్ మగ్స్‌తో 'ఛీర్స్' అంది...!
'బార్...!' మన్నాకానీ నే బైట పళ్లేదు...
' పూర్ గోళ్‌కో ఛాన్సిచ్చి చూద్దాం...!'
అని మాత్రం అనుకొన్నాను...
కానీ.. కానీ
ఓ నేల్లాళ్లగ్గానీ నా జ్వరం బైట పళ్లేదు...

అణువులా నా గుండెలో చేరి
ఆటంబాంబులా పెరిగింది..

తప్పదు -
ఏ క్షణాన్నైనా పేలుతుంది...!
ఓ రోజు
'మరి నేనేం చేయను.. లేదా... నన్నేం చేస్తావ్...?'
అని మొండికేసి
టిక్ టిక్ మంటున్న నా గుండె తీసి చూపిస్తే
అవటానికి డాక్టర్ కదా -
ఆవదం ఇచ్చి
'నీ ప్రేమకిదే మాంచి పర్గేటివ్... ఫో' మ్మంది...!
షిట్...!

అలా
నన్నిక్కడ కలల్లో ముంచి
కొత్త ఎసైన్‌మెంట్ మీద బెంగుళూరు అలల్లో తేలిందా -
'గ్లాడియస్' గాడికి
'లైట్‌గా గుండెపోటు... కానీ ప్రస్తుతం బ్రైట్‌గానే వున్నాడు...'
అని టెలిగ్రాం వస్తే
వాడు బ్రైట్ గానే వున్నాడని తెలిసినా
నెక్ట్స్ ఫ్లైట్లో బెంగుళూరెళ్లాను...
ఒళ్లో వాడితల పెట్టుకోని
బొమ్మ బ్రిలియంట్‌గా కూర్చొనుంది...
నన్ను చూసి
' హీ...! హౌడూయూడూ మైడియర్ ఉడీ ఎలన్...! ' అంది !

అంత గొప్ప ఏకాంతాన్ని చూశాక
నా గుండెకి కాస్తంత కంత పడింది...
' నథింగ్ హాపెన్స్ టుమీ...! ' అని వాడు వింత బోయాక
కేవలం తన సొంత స్టైల్లో చిటికెడంత చిరునవ్వు నవ్వి

లేచి
వాడి బుగ్గ మీద ఓ ముత్తెంవంత ముద్దు పెట్టి
' సీ యూ ఎగైన్...! ' అంటూ వెళ్లిపోయింది...

ఆ ' సీయూ.... ' ఎవర్నో తెలీక
ఆ ' ఎగైన్... ' ఏనాటికో ఎరక్క
ఇద్దరం గుండెపోటుగాళ్లం.... ఎదురుబొదురుగా కూచోని
ఆ ఆడపిల్ల ఆటుపోటుల గురించి
కాసేపు ఘాటుగానే మాట్లాడుకొన్నాం...
చివరికి బాటిల్లో దూకి
గ్లాసుల కొలదీ విచారించాం...
ఆనక... 'బీకేర్‌ఫుల్ బ్రదర్..!' అని
ఒకర్నొకరం హెచ్చరించాం...!

బాగానే వుందా -
తోచక టెలిగ్రాం ఇచ్చి
'బాదల్ దా'
నన్ను కూడా మేల్‌కోటే వర్క్‌షాప్‌కి లాక్కువెళితే
రేత్రి కారు దిగి
ఆ వైష్ణవాలయం ఎదురు విడిదిలో గాలాడక
చక్కటి బూతుబొమ్మల ప్రాకారం క్రింద
బైట
గుడి అరుగు మీద పడుకున్నానా -
చల్లో
తెల్లవారుఝామునకు కాస్తంత ముందరే
నా స్లీపింగ్ బాగ్ జిప్ పర్రపర్రన పగలదీసి
పక్కలో దూరి పడుకొంది...!

చీకట్లోకి చందమామల్ని విడిచి
పడుకుంటూనే పకపకా నవ్వింది...!

అలా నా కోపాన్ని
తన ముద్దుల దువ్వెనతో ఆ అర్ధరాత్రి దువ్వింది -
తెల్లారి బారెడు పొద్దెక్కి లేచి
ముద్దుగా ముఖం మీద గుచ్చుకుంటున్న
మూరెడేసి పొడుగున్న సూరీడి మీసాల్ని విదిలించుకొంటూ
కళ్లు నులు(వుకుంటూ
' ఓ నువ్వా బాస్...!
భాగీ అనుకొన్నాను... ' అంది !
అని సిగ్గుపడుతూ నా బుగ్గ మీద పొడిచింది..!

ఆ దెబ్బకు
ఇక అద్దంలో కూడా నా ముఖం చూసుకోనుండను కానీ...
ఆశ్చర్యం -
ఆ వర్క్‌షాపంత కాలం
ఆ వన్నెల వెన్నెల నన్నే వరించింది...!
ఆ పడమటి కొండల మీది పిచ్చి పూల వానకు
ఇక చాలు..... అని నా జన్మ తరించింది...!

ఆవిడి పరిమళాల మత్తులో తూలుతూ
ఆ మెత్తని అలల్లో తేలుతూ
అలా కళ్లు మూసుకొనే ఇంటి కొచ్చానా -
కళ్లు తెరిచి చూసేసరికి
నా 'అన్నా కరీనా' ఆహ్వానం -
తనకూ భాగీకి పెళ్లంట....!
నేరాకపోతే కాదంట....!

'ఓరి భాగీ...! ఒద్దురో....!'
అని మగ బుద్ధితో
నా స్నేహితుడ్ని ఆపబోయానే కానీ...
ముంచుకొచ్చే వానకు నా ఓటి గొడుగు పట్టబోయానే కానీ...
అ మేఘ మల్హారం
మత్తు ముత్యాల జల్లు విలువేఁవిటో
అప్పుడు నా కర్థం కాలేదు...
ఏదో పిచ్చి కలలో
ఉయ్యాల లూగాం అనుకొంటాఁవే కానీ
అసలు
అన్ని రంగుల ఇంద్ర ధనుస్సు
మా లాంటి మురికి వెధవల కందుతుందా .....?
అందినా.... మాకు చెందుతుందా....?

ఒక్కో వానకు పరవసిస్తూ
ఇప్పుడిక్కడా... అప్పుడక్కడా...
ఎవరికి మాత్రం తెలుసు
ఆ తీయ తుమ్మెద ఎప్పుడెక్కడో...!
ప్రతి ఆడదానితోనూ
ఓ మెట్టు తరిగే మనకు
ప్రతి మగ పశువుతోనూ
ఓ మెట్టు పెరిగే ఆ నిరంతర స్వేచ్ఛ
మళ్లీ
ప్రేమగానో..... పిచ్చిలోనో
మన తల నిఁవిరేదెప్పుడో....!

# మనం రాహువులం గాకపోతే....
# కేతువులం లేవోయ్...!

'షి

ప్రూవ్డ్ టు బి ఫాటల్

టు

హర్ ఓన్ ఫ్రెండ్....!'

'డోంట్ గ్రడ్జ్ యార్....! ఇట్ హాపెన్స్....!'

* * *

మధ్యలో నేనిరుక్కున్నాను .... కానీ

చేయగలిగిందేవీ లేదు....

పాపం.... ఒక్క తన్నుకి

సూరీడి రథం విరిగితే.. సీల ఊడితే

తప్పక.... చక్రంలో వేలు పెట్టాను -
సరిగ్గా
ఆ పాత పతివ్రతకి మగ వర్షన్ లాగే..!
తర్వాత నా దశరధుడు
వరాలేవైనా ఇస్తాడేమోనని జోలె పట్టాను...!

అసలు
మగ వెధవల్ని ఆదుకొమ్మని ఎవడు చెప్పాడు....?
వరాలు... వజ్రాలూ కాదుకదా -
ఆవిడ తన్నిన తన్నుకి
వాడికి సరేసరి... నా క్కూడా అదిరి
అనవసరంగా వరిబీజం దిగినంత పనయ్యింది...!

'ఓరి... నీతి గోతి వెధవా...!
ఇలాంటి తగలబడుతున్న ట్రయాంగిల్స్‌లో
సందులో సడేమియాగా చేరితే... గీరితే.... గిగ్రీరితే...
ఏదో ఓ కొమ్మ కాలే గీరాలి కానీ
కా...క్కో... కోతి పక్కన చేరకూడదు నాయనా...!
ముందు నా సలహా తీసుకో -
అందమైన ఆడవాళ్లు అర్ధాంతరంగా ఏడ్చినప్పుడు
హఠాత్తుగా అందించడానికి
ఓ దృఢమైన భుజం కావాలి కదా... కాసుకో !
కాస్త.... నీ అదృష్టం కూడా చూసుకో...!
విప్పరా... కళ్లు విప్పు...
నీ భుజం మీద కూడా ఓ చిలక వాలొద్దా చెప్పూ...?
వేండా....?
వెర్రి వెధవా....! ఫో....! ఫోండా....!'

సమయానికి
ఈ గెద్ద సలహా చెప్పేవాడు లేకనే
ముందు నా వేలు నలిగింది...!
ఆ తర్వాత బంతి పగిలింది...!

జ్ఞానోదయం కలగడం అంటూ జరిగితే
బుద్ధుడ్ని కావడం ఎంతసేపూ...!
బుద్ధిగా
చందమామలు రెండూ జుట్లూ జుట్లూ పీక్కొని
చివరికి చిక్కి
చిలక్కొక్కాలుగా మారిపోతున్న శుభసమయంలో
నే
రహస్యంగా రాహువుగా కాకున్నా.. కనీసం
ఆవురావురుమనే ఓ అడ్డకట్టుల పిలకపాముగానన్నా
తెగించి
ముందు పాకడం అంటూ పాకి... పనిజరిగితే
పడగ విప్పడానికి ఫరవాలేని పకడ్బంధంగానే
వెళ్లడం వెళ్లాను...

పిచ్చిది -
పిలక పామునే అనుకొంది...
పాపం....
బాగా దెబ్బతిన్న వెనకటి చందమామ కదా -
నా పిడికెడంత పడగనే
అక్షరాలా ఆదిశేషువు నీడలా భావించి....
తూలి...

నా భుజానికి వాలి... సోలి... నిదరబోయింది...!
నా నిప్పు
నెమ్మ నెమ్మదిగా రగలసాగింది...
అమృతం కోసం నా గుండె తొణికి
చీలికలతో నా నాలిక వొణికి
ఆవిడి పగిలిన పెదిమని
కమ్మ కమ్మగా తాకబోయింది...

కానీ...
రంగులు రగులుతూ రాహువు రానే వొచ్చాడు...
పాముల రంగుల్ని.... పొంగుల్నీ
పాములే బాగా కనిపెడతాయి కదా -
పాముల్ని
పాములే బాగా మింగగలవు కూడా కదా -
కాటు
నా కంఠాన పడబోయే సరికి
సర్రున దూసి.. నా తలని
తన పసిడి చేతితో అడ్డుకొంది...!

ఎవరు....?
ఆ చంద.... నో...
నా చంద...... నో...
వాడి చంద.... నో.... నో...
నా చందమామే
లాగి రాహువు గూబమీద కొట్టింది....!
నా గురించనుకోని
నా బోడి పడగ పొంగి మూర్ఛపడబోయింది...

కానీ.... ఆవిడి పొంగు ఆవిడది -
'ఫో...! దాని దగ్గిరికే ఫో...!' అని తిట్టింది...
తిట్టి... మొట్టి
పాపం... వాడిని బైటికి నెట్టింది...!

ముందు కనబడకుండా
రెండు కన్నీటి చుక్కలు రాల్చింది...
తర్వాత... నా తోకపట్టుకు ఏడ్చింది...
క్రమంగా ... క్రమక్రమంగా
నా పడగ నీడకు తన్నుతాను నెట్టుకొచ్చింది...
క్రమంగా... క్రమక్రమంగానే...... రగిలి
రంగు రంగుల వరద కొట్టుకొచ్చింది...
దెబ్బకు -
అంతెత్తున అందని ఆ మబ్బుపింజ
మమ్మ్మమా.. అంటూ
మంచుముద్దలా నేలకి జారిపోయింది..
ఛటుక్కున చందమామ
చక్కటి చిలకగా మారిపోయింది...!

అంతేనా -
మళ్లీ ఎక్కడ నా వేలు నలుగుతుందో
బంతి పగులుతుందోనని బెంబేలు పడుతూ... వొణుకుతున్న
నా ఎడం భుజం మీద
తన
పంచవన్నెలూ విరిచి.... వొయ్యారంగా వాలిపోయింది...!

మరి...
వాడు రాహువైతే
నేనో కేతువునని గ్రహించలేకనో..!
గ్రహించగలిగీ
నిజాన్ని సహించలేకనో....
పోనీ... సహించగలిగే....
సహించగలిగితే.. ఇంకేఁవిటీ -
ప్రాణం లాగిన లాగుడికి.... గుంజ గిజగిజలాడి...
మొత్తానికి
చిత్తానికి చల్లగాలి తగిలి
నా తలలో వెంట్రుకల్ని
పిచ్చి ప్రేమతోనో... పచ్చి కచ్చతోనో
తన చక్కటి ముక్కుతో గజిబిజిగా రేపుతూ
నా దోసిలి నిండా
అడక్కుండానే అమృతధారని వొలుకుతూ
నాకున్ చిక్కిపోయిన
ఆ పచ్చటి చిలక కాలిగోటి బరువుకే
నా విశాలమైన భుజం
నే... నేలకు కృంగసాగింది...! అయినా -
ప్రియంగా నోరుతెరిచి... పాము
చందమామని మింగ సాగింది...!

* * *

' హౌ వెవర్ ఇటీజ్ -
ఐ టూ ప్రూవ్డ్ టు బి ఫాటల్
టు మై ఓన్ ఫ్రెండ్...! '

' డోన్ట్ సల్క్ యార్...! ఇట్ హేపెన్స్....! '

# ఎన్ ఎవర్ ఏలియనేటెడ్ మెలోడ్రామా
# (అను)
# ఓ భేతాళ త్రయోదశిక...!

అవును...
' జాఁన్ - లూహ్ - గోదా ' మా గురువు గారే...!
ఆయన
'మగ వెధవలందరూ పాత్రిక్కులే....!' అన్నప్పుడు
తల వొగ్గి
ఆ క్షణఁవే నా పేరు
'సంపూర్ణ పాత్రిక్' గా మార్చేసుకొన్నాను...!

మరి
దొరకనంత వరకు వెదుకులాటలు
దొరికింతర్వాత..... ఇక ఆడవలసినవన్నీ దొంగమాటలు... కదా
నా పాత్ర చేయాలి...?
కానీ
నాకు దొరికినావిడ.... నో.... నో...

నేనే దొరికినావిడెవరో తెలుసా -
నేనే ఓ పాట్రిక్కునైతే
ఆవిడేమో నా కన్నా పెద్ద హాట్రిక్కు.....!
ఆవిడ ప్రవేశించాక దఢదఢా
ఇక
కథ కాక తప్పదుకదా పూర్తిగా గడబిడ....!!

ముందు
నన్నో పదమూడో సముద్రంగాడిలా
అమాంతంగా ఔపోసన పట్టేసింది...
నా మొలదారానికో గాలం కొట్టి
తన చిటికెన వేలికి చుట్టేసుకుంది...
అయ్యంగారి
తెల్లటి నల్లపొన్ను కదా -
మొదట్లో నలుగురికీ కనబడకుండా
నన్ను లోపల పెట్టి తాళం కొట్టేది...
ఆ తర్వాత
నన్ను బైటకినెట్టి లోన గొళ్లెం పెట్టింది....!

ఇంతకీ
ఈ తాళాలకీ.... గొళ్లాలకీ మధ్య ఏం జరిగిందంటే -
దంటే -
ఆవిడ నవ్వుల మధ్య
నువ్వులు దండిగానే పదిలం చేసింతర్వాతనే
ఆవిడి చేతి కమ్మటి ఫిల్టర్ కాఫీలా
సాఫీగా సాగే మా ప్రేమ కథని తాగనీకుండా.... నో.....
సాగనీకుండా...

నేనే ప్యూర్లీ పంచ్ కోసం
ఓ మాంఛి కన్ఫెషన్ చేద్దాఁవని ఏఁవన్నానంటే -
నంటే -
'నీ మబ్బుల్ని తాకక ముందు వరకూ
నేనే పూవునీ తాకి ఎరగని తిక్కవంకాయని....' అన్నాను...!
ఆబిడయునూ ఎంతో భక్తితో
నే రాసుకొచ్చి సబ్మిట్ చేసిన వర్జినిటీ సర్టిఫికేట్ని
రెండు కళ్లకూ హద్దుకోని
తర్వాత
పైట నెత్తి మీదుగా సర్దుకోని ఏఁవన్నదంటే -
దంటే -
' అలాగా పాపం...!
బ్రహ్మచారిగారు ఫ్రెష్గా వేయించుకు తినడానికి
అయ్యో...!
నేనెలాగూ పవిత్రమైన ఎండు వడియాన్ని కానుకదా...! '
అంది..
'మరి ఎలా గబ్బా...!'
అని కాస్తంత ఇబ్బందియున్ పడింది...
ఆనక
తనూ కమ్మగా కన్ఫెస్సే చేసింది -
ప్యూర్లీ..... తనకు నేనో పదమూడో యాస్ నని...!

అలా... నా తర్వాతి
ఓ పధ్నాలుగో గాడిద
ఆవిడ గడియ కివతల చేరగానే.... గానే....
నా మొలకో 'ఛేస్టిటి బెల్ట్ ' కట్టి...
అనగా.... మరో గదిలోకి నెట్టి

తాళం పెట్టి
'కీ' మాత్రం
తన రెండు గుండెల మధ్యా తలక్రిందులుగా వేలాడేలా
ప్రేమగా... మెళ్లో వేసుకుంది...!

గురువుగారూ...!
కొత్త పరుపుమీద
కమ్మగా ఆయాస పడుతున్నప్పుడు
ఆవిడ
గుండెల మధ్య
నా పెండ్యులం.... బిక్కుబిక్కుమంటూ కొట్టుకుంటున్నా కూడా
ఆవిడ మాత్రం... ప్యూర్ బ్రెక్స్టియన్‌లాగా
ఎలా ఏలియనేట్ కాగలిగింది .....?
నేను
ఫిజికల్లీ ఎలిమినేట్ అయ్యాక కూడా
ఆవిడ మెడ కింది..... లేదా.. మొలకింది
మెలోడ్రామాలో పడి ఎందుకు కొట్టుకుంటూనే వున్నానూ...?

గోదా గారూ..!
జవాబు తెలిసి కూడా చెప్పలేకపోయారో -
మీ సినిమాని
వెయ్యి 'జంపుకట్లు'గా చింపి పోగులు పెడతా...
జాగ్రత్త...!
నేనింకా
మీ భుజాన వేలాడుతున్న.... పాట్రిక్కునే...!

# బర్త్ ఆఫ్ వీనస్

యూ నో....

వాటీస్ మై అల్టిమేట్ ఫాంటసీ...?

నేన్నీళ్లల్లో తేలుతున్నప్పుడు -
పసుప్పచ్చగా ఆకాశంలో ప్రజ్వరిల్లే
రెండు బ్రహ్మాండమైన రెక్కల్తో
ఎర్రగా కనబడే ఓ రెండు అతి చిన్న చుక్కలు....!

నేనాకాశాన్నేలుతున్నప్పుడు -
లేత నీలంగా నడి సముద్రంలో తేలే నిండు చందమామలో
నగ్నంగా నిదరబోతున్న నా వెండి వయ్యారి భామ....!

కన్నమ్మా...!
ఈ కబుర్లన్నీ ఎందుకు -
నీకు తెలీదా
హూ యీజ్ మై అల్టిమేట్ ఫాంటసీ...?

నీ భూ(వే దక్కనప్పుడు
నా శివుడి శిఖరాని కర్ధ(వే(వుంది....?
నా 'శని' అలాంటిది -
కసిగా కోసి
నా కలల సముద్రంలోకి విసిరి వేశాను...!
నీకు తెలియందే(వుంది -
నీ అలలు నాలో చావవురా కన్నమ్మా ....!

కానీ
నాకు ఆశ్చర్యంగా
ఆకాశం అంచునించి ముందుకు ముంచుకొచ్చే
అద్భుతమైన నీ అలల్లోంచి
నా కళ్ల ముందే కమనీయంగా.... నీ అంత కాంతితో
తాకి తరించాలనిపించేంత దగ్గిరగా వచ్చి నిలిచిన
లేత చెంపలురా... అవి కన్నమ్మా....!

నీ సొంత....
కేవలం నీ సొంత పరిమళాల మత్తుటి శ్వాస క్రింద
నీ ఒళ్లో ప్రశాంతతని పొందే నేను
ఛటుక్కున ప్రావోకయ్యి
నా ఆరాధనా తంత్రం... 'సదాంగన్యాస'తో
నిన్ను కొలుస్తానే -
ఆ విద్యుత్ తరంగాలు నా నరాల్లో ప్రవహించి
నా తడి నాలికతో స్పర్శించి పులకించాలనిపించిన
అచ్చం నీలాంటి
బంగారు బుజ్జి ముక్కు పుటాలురా.... అవి కన్నమ్మా...!

శూన్యంలాంటి నడుం నించి
కేవలం రినేసాన్స్ ఉలి మాత్రమే మలచగలిగే
మెత్తటి పాలరాతి కాళ్లలోకి
కసిగా పొంగే
మాంఛి పసందైన మెత్తటి మబ్బుల ముద్దలురా
అవి కన్నమ్మా....!
ఆ రెండు మేఘ మాధుర్యాల మీంచి

రిషీకేశాల గంగలా
గలగలా పరవళ్లు తొక్కుతూ ప్రవహించే
ప్రేమ పాశాల్లాంటి మెత్తటి పీత కేశాలురా
అవి కన్నమ్మా...!

రెచ్చగొడుతూ వచ్చి పడుతున్న 'పశ్చిమ పరిమళాలతో'
విచ్చుకుంటున్న ఆ అతిలోక స్త్రీ రూపాన్ని చూసి
లో లోపల కచ్చగున్నా 'వన దేవత' స్వయంగా వచ్చి
మెచ్చి కప్పుతున్న పచ్చటి మావిడిపూల
శాలువాలు కూడా దాచలేని
పసిడి పాల గిత్తలురా.... అవి కన్నమ్మా....!

విప్పుతున్న పరువాలతో
చటుక్కున మనం
తప్పు చేయాలనిపించే పిచ్చి పెదిమలతో
పుడుతూనే పుష్పించిన ఆ పచ్చి సౌందర్యాన్ని
విచ్చి కళ్ల నిండా చూశాక కూడా
నమ్మలేక పోతున్నాను -
నిలువెత్తున వెలిగిపోతూ
ఇప్పుడే పుట్టిన నీ 'పాప' కూడా
నువ్వే.... నువ్వేరా కన్నమ్మా....!

నమ్మలేకపోతే... నేనేం చేయను....?
ఈ అద్భుతం సాధ్యమో... కాదో
ముద్దుగా కాస్తంత మొట్టయినా
కనీసం నువ్వయినా చెప్పవయ్యా....
ఓ 'బొతిసెలీ...'!

# శ్వేతానందం

అంత అందమైన అరేబియన్ బీచ్‌లో
ఎగెనెస్ట్ ది బ్రిలియంట్ సన్
ఆ రెండు అద్భుతమైన రోమన్ కాలమ్స్‌నీ
అల్పుడినై
వెల్లికిలా నేలమీద పడిపోయి
ఆశ్చర్యంగా చూస్తూ... అలా వుండిపోయానంతే...!

ఆనక.... ఆరునెల్ల తర్వాత
పశ్చిమ సముద్రంలో చేపలు పట్టే వాళ్ల సమస్యతో పాటు
ఈ చేప కన్నుల చెలిమి జాలంలో
నేనూ చిక్కుకుంటున్న చిక్కటి సమయంలో
ఓ చక్కటి సాయంకాలం
ఆ రోమన్ కాలమ్స్ రెండూ
సరిగ్గా మోకాళ్ల దగ్గిర విరిగి
ముందు జాలిగా నా మీద పడిపోతాయని
ఈ మధ్యలో కన్న
ఆరు వేల కలల్లో ఎందులోనూ కూడా అనుకోలేదు....!

నలుపు...
మరీ నలుపు కాని నలుపుతోలు వెధవలం
పాత పాలక వర్గానికి చెందిన
పాలరాతి నునుపు మీద మోజు పడడంలో
కొంత సెల్ఫ్ కన్ఫ్యూజ్డ్ రేషియల్ హీనత
కొంత భావ దాస్యత
రెండూ తగలబడతాయనుకుంటా -

ఎంతైనా మనం సొంగ కార్చడంలో....!
కొంతైనా సేవ చేయడానికి పడిగాపులు పడడంలో...!
వింతేమీ లేదు కదా -
మనం ఓ చిటికెడంత శ్వేతానందం కోసమైనా
అలా
ఊహల ఊడలు పట్టుకు వేలాడడంలో....!
సరిగ్గా చందమామే నడుచుకొంటూ
సరాసరి 'నీలి ఆర్మ్‌స్ట్రాంగ్' గాడి మీది కొచ్చి
నీల్ డౌన్ అయ్యే సరికి
ఆ తెల్లటి కాంతికి
నా నల్లటి గుండె దడదడలాడి..... నిజంగా తెల్లబోయింది....!

అరగంట అమృతవర్షం తర్వాత
నాలో
అష్ట క్షారాలన్నీ ఏకమై హడావిడి పడుతోంటే.....
ప్రాణం గిలగిల్లాడుతోంటే..
నా వేళ్లు
విద్యుత్తీగలన్ తెంచి తెల్లటి మెరుపులై మెరుస్తోంటే..
సడన్‌గా -
'యూజ్ షీత్ మాన్....' అంది !

షిట్....
ఇప్పుడంటే..... ఈ మందులేని రోగ యుగంలో
స్టాక్ పెట్టుకోవడం అలవాటైంది కానీ
ఆ అమాయక కాలంలో
అడ్డదిడ్డంగా పడుతూ లేస్తూ... పరుగులెత్తడమే తప్ప
ఈ షీతులూ....

అందమైన రంగులతో ఆచ్ఛాదించబడిన బూతులూ
ఏం తెలుసు....?

'ప్లీస్.... గెట్ వన్...! ' అంది ముందు....
తప్పదు..... ఆ తర్వాతే విందు....!
అప్పటికే తేలిపోయి
గదంతా వ్యాపించిన ఊపిర్ని కూడగట్టుకోని
కఠినమైన నా కటిమండాలానికి
గబగబా గడియలు పెట్టుకోని
నీరసంగా లేవబోతోంటే...
'స్టాప్‌మాన్... గాట్ వన్...!' అంది....
అని.....
ఒకటి
తన సంచిలోని గతపు మరపు మడతల్లోంచి లాగింది..!

అప్పటికే ఓ చావుచచ్చి గాల్లో తేలుతున్న
నా భూతాన్ని
ఓ చక్కటి గులాబీ రంగు చిరు సంచిలో
ముద్దుగా బంధించి
మధురమైన మంత్ర తంత్రాలతో
అద్భుతంగా భూస్థాపితం చేయబోయింది... కానీ
ఆవిడి తాంత్రిక తీవ్రతకి తట్టుకోలేక
అసలే గిజగిజలాడుతున్న నా పిచ్చి భూతం
జస్ట్....
జస్ట్.... భూమిని తాకీ తాకగానే
ఆగ లేక....
ఆవేశంగా.... భళ్లున పేలి... బ్రద్దలైపోయింది....!

# రెక్కల బాధ రెక్కలిది...!

'నా ప్రియురాలికి
నువ్వు ఒకనాటి ఆల్టర్ ఇగోవి...
నీ తల తెగవేస్తేనే గానీ
ఇప్పుడు నేనుగాను...'
అని
ముందు ఓ ఇంగ్లీష్ పద్యం తెలుగులో చదివిగానీ
తన చిరుకత్తి దూయలేదు -
ఆ చక్కటి ప్రేమ పిచ్చిది...!

ఇదెక్కడి విడ్డూరం -
నాకూ... నాకన్నమ్మకూ మధ్య
పోటీ
వస్తే గిస్తే... మరో మగ వెధవ రావాలిగానీ
ఈ వెన్నెల వరద ఎవరు...?

ఎస్... వరదలాగే వచ్చింది...
నన్ను ఒడ్డుకు నెట్టేసి
నా కన్నమ్మని కొట్టుకు పోయింది ...!
ఒళ్లు మండి
ఆ వెన్నెల మీదికి చిమ్మ చీకటిలా దూకాను..
ఆకాశం చీల్చి చూద్దును కదా -
వెలుగూ... వెన్నెలా ఏకం అవుతూ
' పెటీ పాలే' లో
కోమలాంగు లిద్దరూ నగ్నంగా నిదరబోతున్న
కమనీయమైన తన కాన్వాస్ పరుపుని... ఓ మెరుపులా
'కోర్బే'
నా కళ్లముందు పరిచాడు...!

'జో హెఫర్మా' అంత ప్రశాంతంగా
తన బంగారు జుట్టుని
తన జంట చందమామల మీద విరబోసుకోని
నగ్నంగా మెరుస్తున్న 'వెన్నెల వరద' కాలుని
తన తియ్యటి తొడ మీద వేసుకొని
హాయిగా ఆదమరిచి
నా కన్నమ్మ నిదరబోతోంది...!

ఆమె మెడలోని నా ముత్యాల దండ
మౌనంగా తెగి
పక్కనే పరుచుకున్న వెన్నెల ముందు
వెలవెలబోక
ఇహ తళతళ మెరుస్తుందా.....?

ఎగిరి ఎగిరి అలిసిపోయిన నీ రెక్కలకు
నీ ఆకాశంలోనే నీకు లభించే
ఈ వెన్నెల మబ్బుల పాటి ఆధారం
నా నేలమీద
నేను పరిచే ఏ పూల పానుపూ
నిజంగా నీ కివ్వలేదా.... కన్నమ్మా ?

ఏమో....!
దర్జాగా నేల మీద నిలుచోని
ఆకాశాన్ని...
అలిసిపోతూ కూడా ఎగిరిపోతూనేవున్న రెక్కల్ని...
అంత తేలిగ్గా అంచనా కట్టలేనేమో...!

నే నష్టపోతే పోయాను -
పోనీలే...
రెక్కల బాధ రెక్కలిది...!

# క్షతగాత్ర సమాధానం

'నీ ప్రియురాలంటే
నీకే కాదోయ్ .... మాకూ ప్రేమే...!'
అనక తప్పలేదు ఆ నలుగురికీ -
నా రెండు కళ్లలో గుచ్చుకున్న ముళ్లని జూసి...!

ఆకాశం ఎప్పుడూ అందదురా పిచ్చివాడా !
మనం తాకగలిగేది... గలిగితే తరించగలిగేదీ
కేవలం ఉత్త మబ్బుతునకల్నే...
మనం మురిసేది
ఆ కాసేపు మంచుపొగల్లో మునకల్నే...!
ఉరేయ్...!
ఆ మబ్బుల మాధుర్యాలైనా
మనుషుల్లాంటి నేల విడవని నిర్భాగ్యులకు దొరకవురా....!
క్షణమ్రైనా
ఆ అద్భుత వీక్షణం...... ఆ కాంతి భక్షణం...
ఆ విద్యుద్ఘాతానికి దిమ్మ తిరిగి
గాల్లో గింగిర్లు కొట్టగలిగే అదృష్టం
మన లాంటి పక్షి వెధవలకేరా...!

బాధపడకు....
మనలో మనం పోటీపడి
ఒకరికి తెలియకుండా ఒకరం
మన పిడికిళ్లల్లో దాచి పెట్టటానికి
మళ్లీ మళ్లీ చేతులు జాపినందుకు...
పోటీలు పడి చేతుల్లో చిరుకత్తులు మొలిచినందుకు....
మన నాలికల్లోంచి సొల్లు
మన గోళ్లల్లోంచి నెత్తుటి జల్లూ
కారినందుకు... వారినందుకూ
ఆ ఆకాశకన్య విధించితీరే ఏకైక శిక్షగా
మన ఒక్కో రెక్కా తుంచి
మనం ఒకరికి తేలీకుండా ఒకరం కట్టిన
తాళ్లు తెంచి
హాయిగా ఎగిరిపోయిన ఆ అద్భుతం కోసం
కళ్లూ.... నోళ్లూ.... ఆత్మల్నీ ఆబగా తెరుచుకొని
ఓ యుగాంతం వరకూ
ఇలా ఒంటి రెక్కలతో ఆకాశంలో ఎగురుతూ
నేల మీద పడుతూ
అలా ఎగురుతూ... పడుతూ ఎదురు చూడాల్సిందే....
తప్పదు....!

కూ
ఒక్క రేక్కేకదా తెగింది -
ఎలాగోలా ఎగురుతూ వొచ్చి మాలో చేరు....
తిరిగి ఆమే వచ్చి
నీ తల తరించే రోజొచ్చినప్పుడు
తిరిగి పడితే పడుదువుగాన్లే
మళ్లీ మాతో వేరు....!

# అర్థాశ్వమేధం

నా దేవత చిరు స్పర్శ మాత్రానికే పరవశించి
నా పశువు
చిటికెన వేలిలో
చిటికెడంత మానవత్వం చటుక్కున కదిలింది....!

ఆకాశం
మధురంగా నా ముఖం మీదికి వొంగి
నా హృదయంలోనికి నా దేవత ఊగేందుకు
ఇంద్ర ధనుస్సుని వంచి
వెయ్యి కలల ఉయ్యాలగా మార్చింది...
ఎందుకోగానీ

ఈ పశువు మీద కమ్మటి కసి కలిగి
వెయ్యి అలల ఉప్పెనగా
ఆ దేవతకు ముద్దు ముంచుకొచ్చి
తన కళ్లలోని ఓ వెచ్చటి కోరికల కిరణం
దూసి
నా గుండెలోకి గుచ్చింది..

దాంతో
నా పశు అస్థిత్వం చచ్చి
నా గుండె భక్తితో భగ్గుమనగానే
ఆ అదృష్టాన్ని
అందుకోబోయేందుకు అర్హత పెంచుకుంటూ
అద్భుతంగా నా హయవదనం
మధురంగా మనిషి రూపు దాల్చింది....!
మింటినీ... మంటినీ ఏకంగా దున్నే
నా పొగరు మోతు గిట్టలు
ఆ వెండి మబ్బుని మృదువుగా తాకే
మత్తు చేతులుగానూ....
ఆ కొండ మీది వెయ్యి వన్నెల వెలుగు చూస్తూ
నిర్భయంగా..... నిలువుగా నిలవగలిగే
పసిడి పాదాలుగానూ ..... మారిపోయాయి....!

ఇక
నా అరివీర భయంకరమైన హయధ్వజం
నా రక్త సముద్రాల్ని చీల్చుకొని
ఎఱ్ఱటి ఆకలి ఆవేశాకాశంలోకి ఉప్పొంగి

ఆ సహస్రదళ ప్రళయాగ్ని పద్మాన్ని
భగ్గని మండించి
కాల్చి.... కేవలం నుసి చేయకుండా.....
చేయకుండా....
రైజింగ్ ఓన్లీ అప్టుది అకేషన్‌లాగా
ఒబీడియంట్‌గా
మానవ మర్యాదల కనుగుణంగా
మానవ మాత్రపు పరమేశ్వరుడిగా
మారిపో....
పోబోతోంటే -
'నో....'
అంది నా దేవత....!

నా అణువణువూ
పశువునించి మనిషిగా మారింది....
కానీ
ఒక్క నా పరమశివుడ్ని మాత్రం
మనిషిగా కాక
పరమ పశువుగానే వుండి పొమ్మంది....!
అని
ఆ పద్మనయనాల దోయంతో
ఆ మేరకు మాత్రం నా పశుత్వాన్ని దోచుకుంటూ
శాసించింది....!

ఆ శాసన భాగ్యం కారణంగానే
ఎస్....
ప్రస్తుతం నేనింకా సగం పశువునే.....!

# రాతి మనిషినే కానీ...!

గాలి కాళ్లు కట్టేయడంలో
రాతి కొండల కెంత ఆనందం కలుగుతుందో
అఫ్‌కోర్స్... నాకెందుకు తెలీదూ -
ఆఫ్టరాల్... నేనూ మగవెధవనే కదా...!

ఆ మబ్బులు
తమ మెత్తని తలల్ని
నా కరకు కాళ్ళకేసి కొట్టుకుంటూ
ముందు 'మియా మల్హారై' వలవలా వర్షించినా
ఆ 'బర్డెన్ ఆఫ్ పాసివిటీ' నా కర్థం కాలేదు...
కానీ కన్నమ్మా...!
ఆ తర్వాతి...నా గుండెలోని కన్నీళ్లు నీకూ అర్థం కాలేదు...
అంతా కన్‌ఫ్యూజనే...!

చివరికి
నా కన్నీళ్లలో నువ్వు కరిగినప్పుడు కూడా కాదు కానీ
నా లాంటి రాళ్లుకూడా తన్మయం చెందే
నీ తాళ విన్యాసానికూడా
తిరిగి నా కాళ్లు తప్పటడుగులు వేసినప్పుడు
నీ కళ్లలో మెరిసిన నిప్పుల చూపు మాత్రం
ఢమఢమఢమ ఢమరుక శబ్ద ప్రహారాలతో
పటపటపట పళ్లు కొరుకుతూ

'ఖాన్ సాహెబ్ అబ్దుల్ కరీం ఖాన్ ' గారి
అద్భుతమైన అర్ధనారీశ్వర గళం నించి వెలువడిన
'పటదీప' ప్రకంపిత ప్రళయ గానంలో కలిసి
సుడిగాలిలా వీచి
నా గొంతు చుట్టూ తిరుగుతూ
సున్నితంగా కోసిన కోతకు
నా తల తెగి... మధురంగా ముక్తి కలిగింది !

తలైతే తెగిందిగానీ
సనాతన మగతనపు స్పాండిలైటిస్ వల్ల
తల తెగినా బ్రతికేవున్న అనేక గ్రీకు శిల్పాల్లా
అంత తేలిగ్గా
నా కొండ
మొండి మొండెం లొంగదు కదా...!
నడుం వొంగదు కదా...!
అంతా కరకు రాళ్లతో కట్టి.... నిట్టనిలువెట్టి
బిర్ర బిగిసిన మగ గర్రమే కదా ...!
కదా కన్నమ్మా...?

లేచి
ప్రళయంలా వీచి
లాగి తంతేగానీ
పెద్ద
ఫెళఫెళలాడి అడ్డంగా పడిపోదు కదూ...?
ట్రై చెయ్యి....!

# హలో....! హోలా.....!

రగ్గ
ఏదో మాఘ మాసం కదాని మీది కొస్తే
'ఒద్దు మొర్రో....!' అని
కణకణా కాలుతున్న
నా కన్నమ్మ 'నిప్పుల కుంపట్లు రెండు చాలు....'
అనగలిగే రసికుడ్ని కాగలిగితే ఎంత బాగు....!

ఒకానొక ఎండాకాలంలో -
ఖచ్చితంగా చెప్పాలంటే... 'మే' మాసంలో...
ఇంకా చెప్పాలంటే -
పందొమ్మిది వందల ఎనభై ఆరో సంవత్సరంలో...
ఒకటి... రెండు... మూడు... నాలుగు...
నాలుగంటే నాలుగు రోజుల పాటు మాత్రం
నన్ను..... నా ఎదనీ... నా కోరికల కందిరీగ పొదనీ
కణ కణా కాలుతున్న తన కుంపట్లతో కుమ్మి
చెమటలు కారుతున్నా
నా గొంతుని తెంపి
కమ్మటి తేనె తెమ్మెరలతో నా గుండెని సాంతం నింపి
'హ.... హ... హో....' అంటూ
నన్ను తన అగ్ని గుండంలోకి నిలువునా తోసిన
నా కన్నమ్మని చూసి

నా అదృష్టానికి రోసి
గ్రీష్మంలో
సూర్యుడు గుర్రుమంటూ ఎంత కుళ్లి చచ్చాడో...!
ఎర్రగా కందిన వాడి ముఖం చూసి
మేఁవిద్దరం పగలబడి ఎంత నవ్వి విచ్చామో...!
ఏదీ....
తిరిగి ఆ కన్నమ్మ కనబడితేనే కదా
చెప్పుకు మురిసేది...?
గతం
క్షణం అన్నా కళ్లముందు విరిసేది....!
ఇప్పుడు నా దిక్కులేని తనం చూసి
ప్రతి గ్రీష్మంలోనూ
ప్రతి సూర్యుడికీ అలుసే...!
ప్రతి మాఘంలోనూ
నేను కప్పుకోక తప్పిజావని
ప్రతి రగ్గు ముండకీ అలుసే....!

కన్నమ్మా....!
ప్రతి కారుమేఘం వంకా
మోరెత్తి చూసి నేను
ప్రతి మోడుకీ మదిని కెలికేలా
'మల్హారం' విలపిస్తానే -
కనీసం
నీ దయలేని మేఘం
ఎండిపోయిన నా నాలుక మీద
ఒక్క కన్నీటి చుక్కన్నా రాల్చకూడదా...!

# గుర్రాలకే తెలుసు గుస గుసలు....!

నా వేళ్లన్నిటికీ కళ్లుంటాయని
నా కన్నమ్మకెందుకు తెలీదూ -
అవి
ఆవిడ ప్రేమగా పెంచుకొంటున్న
పిచ్చి మూతుల చేప పిల్లలయినప్పుడు....!

ఈ చక్కటి
సెలయేటి సల్లాపాలల్లా
కమ్మటి నేతి వాసనల యజ్ఞ జ్వాలల్లా
రగిలేందుకు
నిరంతరం కాలే సమిధలు కూడా కదా
మరి నా వేళ్లు.....!

అయ్యా....!
ఏఁవని చెప్పుదు నా వేలిగోల -
అర్ధాంతరంగా సింఫొనీ ఆగిపోయిన ఓ అర్ధరాత్రి వేళ
అప్పటికప్పుడే పడుతూలేస్తూ
చందమామని చంపలేనన్న నా చపల చిత్తానికి
చిరు శిక్షగా
ఛటుక్కున కొరికింది కసిగా...!

మరి...... నా అన్ని వేళ్లకూ కళ్లున్నా
పసిడి పద్మాలకూ పళ్లుంటాయని
కనిపెట్టలేక పోయాయి..... పాపం పసిగా....!

అచ్చం
'మోమాత్ర్'లో 'తోలూస్ లూత్రే' పరిస్థితే కదా....!

వెధవది
నాకు పదివేళ్లకే అయితే
ఆయన కుంచెలోని ప్రతి వేణికీ
ఓ కన్ను కలిగిన ఇంద్ర ధనుర్ధారి కదా
ఆ పొట్టివాడు....!
భుజానికి నిరంతరం వేలాడే ఓ రంగుల పెట్టివాడు....!

అయినా ఏం లాభం -
'మోలాఁరూజ్' రంభలు
కొసలకున్న కళ్లనే కాదు -
అసలు కుంచెనే కరకరా నమిలి మింగేస్తే.....!
చచ్చిపోతూ కూడా ఆ పిచ్చికుంచె
ఆ తారల్ని తాకినందుకే తరించిపోయానని
హాయిగా కళ్లు మూసుకొంటే -
వెధవది
నా కన్నమ్మ వేలు కొరికితే మాత్రం.....
వేలేం ఖర్మ.... గొంతు కొరికినా
వెల్లకిలా పడి
కాళ్లూ చేతులూ ఎగరేసి
కేరింతలు కొడుతూ దొర్లే
మచ్చికైపోయిన పిచ్చి గుర్రాన్ని కాకుండా పోతానా -
కొరికిన కాసేపటికే
కన్నమ్మ చెప్పే నా చెవిలోని గుసగుసలకు....!

# ప్రకృతి - పురుషుడు

పిచ్చి వెధవ
పడవేసుకోని తేలి
సముద్రాన్ని జయించాననుకొంటాడు...!
గాలి పడవేసుకోని తేలి
ఆకాశాన్నీ జయించాననుకొంటాడు -
బోడి పడగేసుకొని
వీడి పాము
ఆ కాళి పాతాళాన్ని జయించాననుకున్నట్టు...!

కన్నమ్మా...!
కనీసం నువ్వన్నా నా కందావా -
కాళిని
కన్ను తెరిచి తరచి చూసి తరించేందుకు...!

అందుకనే.... స్త్రీ అనగానే
అనంతమైన ఆకాశం
గాలి
అగ్ని
సముద్రం

నేలా
ఎడం చేతిలో వేలాడుతూ తెగేసిన తల
గుర్తొస్తాయి....!
మరి
సృష్టి స్థూలం అంతా స్త్రీయే ఆవరిస్తే
ఇక పురుషుడికి మిగిలిందేవిటి....?
వర్తి బీజం...!

అదే....
ఆ సృష్టి సూక్ష్మవే
వాడ్ని ఈశ్వరుడ్ని చేసింది...!
అదే...
ఆ ఈశ్వరుడూ.... ప్లస్
వాడి విగ్రవీగుడూ కలిస్తేనే
ప్రళయం వస్తోంది....!

రాక తప్పదు
ప్రకృతిలో ప్రళయం రాక తప్పదు...
అంత వరకూ వీడు
బోడి పడవేసుకోని తేలి
సముద్రాన్ని జయించాననే అనుకుంటాడు...!
గాలి పడవేసుకోని తేలి
ఆకాశాన్నీ జయించాననే అనుకొంటుంటాడు....!
అనుకోనీ...
ఎందాకా...?
నాలికలు జాచి భూమి అంటుకునే దాకే కదా....!

# సానుభూతి సారాంశం

మా ట్లాడితే
'నా మొగుడు నన్నెంత బాగా చూస్తాడో.....!'
అని
అసందర్భంగా అందరికీ చెప్పుకు తిరిగే
ఆ మగువని చూస్తే
మా చెడ్డ బాధ పడుతుంది మనసు .....

మరేం లేదు -
మచ్చుకైనా తన ఊసు
తల్లో పెట్టుకోబోయే ముందు
తన పూలతో కూడా చెప్పుకోలేని
పడగ నీడ
ఆ ముద్దు మాటల వెనక
నక్కి దాక్కుంటుందని నాకు తెలుసు .....

తనది చెక్కు చెదరని సంసారం అని
మాటి మాటికీ చెప్పుకుంటున్నా
ముఖం ఎప్పుడూ చిరునవ్వుతో కప్పుకొంటున్నా
కళ్లెప్పుడూ లేనికాంతితో విప్పుకుంటున్నా
మనకు
కనబడుతూనే వుంటుంది కంటిలో ఆ నలుసు.....!

ఆవిడి పాముకు -
పిచ్చిగా రాలిపడే పున్నాగ పూల మీద
పట్టరానంత మోజువున్నా
రోజూ పొగలూది నిప్పు రాజుతూనే వున్నా
తన సొంత మొగలిపొదలో ముడుచుకోకపోతే మాత్రం
పాపం ..... నిదరే పట్టదట .....!

ఆవిడి గుండెలో పెరుగుతున్న
పుట్టని పొడిచి
తోక బట్టుకు లాగి
'ఇది పాము.....' అని
ముఖం ముందు వేలాడదీయగలిగినా -
ఆవిడ 'చూడను మొర్రో.....!' అని
కళ్ల మీద కప్పుకొన్న చీకట్ని చించి
నిజం
నేనెక్కడ చూపించను.....!
అయినా నాకెందుకు -
ప్రతి ఇనపతెరనూ తెంచను.....!

ఖర్మ ఏవిటంటే
కనీసం అంటగట్టిన యముడు కూడా కాదు -
తప్పు తల్లిదండ్రుల నెత్తిన రుద్దడానికి.....!
తను సొంతగా తెచ్చి మెడకుచుట్టుకున్న
పొడల పాముతో
పడగ కింది కాపురంవాయే..... వెలగబెట్టడానికి.....!

ఏం చేయను -
పాపం..... ఆ పాడుబడ్డ పుట్టనే

పట్టు పాన్పుని చెప్పుకొంటూ
లోలోపల నెత్తికొట్టుకుంటూ
లోకం కోసం
ఆ పుచ్చిపోయిన సంసారాన్నే
చచ్చేదాకా సాగించాలనుకునే
ఆ పిచ్చి పిల్ల అందించే ప్రతి అబద్ధాన్నీ
ప్రతి సారీ
పరమ ఔషధంలాగే దిగమింగుతాను..... కానీ.....

ఓ సారేం జరిగిందంటే -
పగలబడి దూకుతుండే ఆవిడ ప్రతినవ్వూ
నాకో చావు శోకంగానే వినిపిస్తుండడం చేత
ఎలా రియాక్ట్ అవ్వాలో తెలీక ..... ఏవీ తోచక
జాలిగా ఆవిడి తల దువ్వాను .....
అంతే -
నా గుండెలో మొగలి పొదలు గలగల మనేలా
నా వెన్నులో నాగు పైకి జరజరా పాకేలా
తో.....
త్తోచక తలదువ్విన చెయ్యిని
తన రెండు చేతులతో మృదువుగా తీసి
తన రెండు గుండెల నడుమా హత్తుకుంది .....!

నలభై కోట్ల నక్షత్రాలు బిత్తరపోయి చూసేలా
చందమామ రెండు ముక్కలుగా విరిగి
వికృతంగా విరబడి నవ్వింది -
ఆవిడ్ని చూశా .....?
నన్ను చూశా .....?

# 'సాదె'

'సాదె' గొంతు విన్నట్టయి
సరాసరి సూర్యుడి వంక చూశాను...
ఎంత పొడిచినా
వాడి కిరణాలకా చురుకేదీ...!
సిగ్గుపడి మబ్బు చాటున ముఖం దాచేసుకొన్నాడు...

మొన్న రాత్రి
కన్నమ్మ దొంగలా వెనకనించొచ్చి
నా చెవ్వు చిరుగాటుగా కొరికినప్పుడు
నరం జివ్వు మనగానే
నవ్వు విరజిమ్మి
ఆనందంగా పగిలి పాడిన 'సాదె' పాట ప్రకంపనం
సడన్‌గా ఇవ్వాళ... ఈ నడి రోడ్డు మీద
నా గుండె కంపనం లోంచి
ఒక్కో బొట్టుగా ఒలికి
విను.... విను.... మళ్లీ విను.... అని వినిపిస్తోంది !

'సాదె'
నాకెవ్వరంటే ఏఁవని చెప్పను...?
అప్పుడోసారి
అన్ని వేలమైళ్ల దూరంలో
సౌత్ చైనా సీ తీరంలో
ఒంటరిగా వెన్నెల్లో కూచోని
'శామ్ మీగల్' తో గొంతు తడుపుకొంటున్నప్పుడు
నా కళ్లలో ఎర్రని జీరలా కన్నమ్మ జారబడి
గుండెలోకి జారి
నా నెత్తుటి తీగల్ని గోటితో మధురంగా మీటినప్పుడు
ఆ బాధని పలకడం

నా ' దేవబ్రత బిస్వాస్' క్కూడా సాధ్యం కాలేదు....
అలాంటిది
సడెన్‌గా ఆకాశంలోంచి
మేఘం కదిలి ముందుకూగినట్టు
'సాదె' స్వరం విన్నానా -
నల్లటి కసితో పొంగుతున్న తెల్లటి సముద్రం అలల్లోంచి
ముసిముసిగా నవ్వుకుంటూ
ముద్దు పెట్టుకోబోయే మూన్‌ని పక్కకి నెట్టుకొంటూ
పరిగెత్తుకొంటూ వొచ్చి
పచ్చటి కన్నమ్మ కనిపించి....
కన్ను మూసి తెరిచేంతలోనే తిరిగి మాయమయ్యింది....!

తెలిసిందా -
మనసులో 'సాదె' ఆవేశించిందంటే చాలు
సముద్రాల ఆవలనించైనా సరే
ఆ శాంస్క్రిట్ కింగ్‌ని కూడా తలదన్నే
మేఘ సందేశాల్ని రప్పించగలదు...!
సాధ్యం కాని చోట కూడా
ప్రేమ చిత్తరువుల్ని తెప్పించగలదు...!

తన స్త్రీ కోసం
నిజంగా పురుషుడు తపిస్తే
స్త్రీ కనుకనే 'సాదె'
ఈ గుండెలోని మాట ఆ గుండెలోకి పాడగలదు...!
ప్రపంచంలో ఏ పురుషుడికీ
ఈ 'సాదే'శాల ఆట సాధ్యం కాదు...!

నిప్పుకణికలు నెత్తుటి పూలుగా మారడం
స్త్రీ కంఠానికే సాధ్యం...!
మార్చడమూ స్త్రీకే సాధ్యం....!

# మహా యోగిని

ఆయనకు డ్రైవింగ్ రాదు....
నేర్చుకోవాలనీ లేదు.....
ఆవిడే చేస్తుంది డ్రైవింగైనా.... డైవింగైనా.....!

ఆవిడకు వంటరాదు..........
నేర్చుకోవాలనీ లేదు .....
ఆయనే చేస్తాడు వంటైనా ..... ఒదిగుండడమైనా.....!

నిరంతరం జాగర్తగావుండే
నాలాంటి జాకాల్స్‌కు
ఆయనేమో పదికోట్ల జోకుల బుట్ట.....!
ఆవిడేమో పడగలిప్పిన పాముల పుట్ట.....!

వెనకటికోసారి
నాకూ డ్రైవింగ్ రాని రోజుల్లో

ఎవరిదో ఫాం హౌస్ పార్టీకి
తను
తన స్నేహితురాలితో కలిసి..... 'లేటుగొస్తాను'
అని -
నన్ను ముందరెళ్లమంది.....
తన మొగుడ్ని తీసుకోని
తన కార్లో.....!

అయితే
నాకూ ఆ మగ విద్యరాదని చెబితే
పక్కనున్న తన కొత్త స్నేహితురాలి
మెత్తని మేఘాలు మధురంగా కదిలేలా
అచ్చం ఓ మగ నవ్వు నవ్వింది.....
కానీ తనదీ
పూర్వం నా పూజకు పొంగిన మొగలిపొదే కనుక
ప్రేమతో
'నో ప్రోబ్లం.....
ఐ 'ఇల్ టీచ్ యూ హౌటూ డ్రైవ్' అంది.....
అంతకన్నా ముందు
నా కంతకు ముందు తెలీని ఓ డ్రైవింగ్ మాత్రం నేర్పింది.....
అంతేనా -
ఆ కొత్త పాఠాన్ని
తన కొత్త పిచ్చికకు నేర్పమంది.....!
దగ్గిరుండి నేర్పించింది.....!
ఆ గురుత చాలదా
ఆనక
ఆవిడ నన్ను కమ్మగా

గోంగూర మాంసం వొండి పెట్టమని ఆర్డరివ్వడానికి.....!
వండి పెట్టినాక
ఆవిడే దయతలిచి వొడ్డించేదాకా నే వొదిగుండడానికీ.....!

నిజం ఒప్పేసుకోనా -
మామూలు స్త్రీలకు నేనెంత వీర మొగుడ్నయినా
ఈ మహా యోగిని మాత్రం
నా లాంటి మొగుళ్లందరికీ మహా మొగుడని.....!
మేఘాల్నీ..... పర్వతాల్నీ..... సముద్రాల్నీ..... అన్నిట్నీ క్షణంలో
మనకు తెలీకుండానే మనతో తగలబెట్టించే
ఆ తాంత్రిక రహస్యం
అందిస్తే అనుభవించి..... హాయిగా నెమరవేయడమే కానీ
అసలు మంత్రం ఏవిటో నిజంగా నాకూ తెలియదని.....!
అలాంటి ఎన్నివేల సనాతన మంత్రాలు
ఆవిడి మహామహిమాన్విత మండలానికి
బందీలై వున్నాయో ఎవరికీ తెలియదని.....!

కానీ
ఇంటికొచ్చాక
వచ్చీరాని నా కొత్త విద్యలోని
ఓ చిరుమెరుపుని మాత్రమే ప్రదర్శించగానే
క్షణంలో కనిపెట్టేసింది నా కన్నమ్మ.....!
ఇంటలెక్చ్యువల్ ప్రోపర్టీ రైట్‌లాగా
ఈ డ్రైవింగ్ రైట్ కూడా
ఆ డ్రైవింగ్ ..... నో ..... ఆ డ్రైవింగ్ సుందరి దొక్కదాని దేనట.....!
ఆ సంగతి నా కన్నమ్మ క్కూడా తెలుసునట.....!

"తెలుసా.....?
ఈ మహామండల మంత్రం నీకెలా తెలుసు.....?
ఖన్నమ్మా.....! నీకెలా తెలుసు.....?
చెప్పు.....!
చెపుతావా లేదా.....!''

నా గుండెలో ముల్లు కెలికి
నలిపి నలిపి నా కన్నమ్మ కంటిలోని
నలుసు బైటికి లాగాను .....
నే గుండె చితుకుతోంటే
తాను నవ్వుతూ అప్పుడు చెప్పింది -
పూర్వం ఓసారి అపూర్వంగా
తన మేఘాల్నీ ..... పర్వతాల్నీ ..... సముద్రాల్నీ
ఏకంగా అరక్షణంలో తగలబెట్టిందట.....
నో .....
తగల బెట్టించిందట ..... ఆ మహా యోగిని !

"ఏ..... ఏ ..... ఎవరితో .....?'' అన్నాన్నేను -
ఎంతయినా నేను మగ వెధవనే కదా.....!
సుంతయినా వింత బోక తప్పదు కదా.....!

డ్రైవింగ్ రాకపోయినా .....
ఆవిడ పుణ్యాఁవా అంటూ డైవింగ్ మాత్రం బాగా నేర్పిన
ఆవిడకు వొండి బెడుతూ ..... వొదిగుండే
ఆవిడి మామూలు మొ ..... మొగుడి గారితోనే నట .....!
కటకటా.....!

# థాంక్యూ 'క్లిమిట్'..........!

నీ కుంచె చిరు స్పర్శ చాలేమో
స్త్రీలు పులకించి పుష్పించడానికి .....!
ఆ ఎర్రటి వేడి వలపులో నీ వేలు ముంచితే చాలేమో
ఆకాశపు కాన్వాసంతా
విచ్చి సువర్ణంగా మారి
పచ్చి సుగంధం వర్షించడానికి .....!
థాంక్యూ 'క్లిమిట్'.....! థాంక్యూ.....!
ఇంత చీకట్లోనూ
తిరిగి నా ముందు నా కన్నమ్మని తెచ్చి నిలిపావు .....!

కన్నమ్మా.....!
నీ మత్తు మనసారా తాగి
చిత్తుగా మైమరచి పరున్నప్పుడు
క్రూరమైన
నీ మెత్తటి నెత్తుటి నాలికతో
నా మెడ కోసి అమరుడ్ని చేస్తే చేశావు గానీ -
ఓ నా జవ్వాది పరిమళాల 'జూడితా'.....!
మరి
నీ ముద్దు ముఖంలో
ఇంకా నా మబ్బుల్లో తేలుతున్న మాధుర్యం ఎందుకో.....?
తెగిపోయి నీ పాదాల నంటిన
నా నిర్జీవ శిరంలోంచి
లేచి
సరసరా ప్రాణం
ప్రచండంగా పడగలిప్పి పొంగుతూ
ఇంకా తొలిచి తొలిచి

నా స్వర్గాన్నే చేరేందుకు తపిస్తున్నందుకా.....?

చూడ చక్కగా నీ చుక్కలు రెండూ మెరుస్తోంటే
చూడనీకుండా మత్తుగా మూతలు పడే
నీ తలపుల తలుపుల్నడుగు.....
నీ ఆకాశం అంతా 'అస్సీరియన్ అడివి' గామారి
క్రూరంగా నీ కోరిక బంగారు వర్షాన్ని కురుస్తోంటే
మధురంగా విచ్చుకొన్న నీ ముత్యాల మూట నడుగు .....
వేడి తగ్గి
వినయంగా తడబడుతూ
నువ్వు తెంపిన నా తలలోకి
నీకే తెలియని పిచ్చి ప్రేమతో
పసి పాముల్లా పాకుతున్న
నీ వయ్యారపు వేళ్ల నడుగు .....!

గొంతు కోస్తే కోసిందిలే గానీ
హలో ..... ' హలో ఫెర్నిస్ '.....!
నువ్వు నిజంగా అమరుడివోయ్.....!

పోస్ట్ పోయమ్ :

సారీ 'రొబర్తా' .....!
నీ కత్తి చాలా పదునే కానీ
నీ కళ్లు అంతకన్నా చురుకు .....
నువ్వు గొంతు కొయ్యబోయే వాడికి
చురక తగలక మానదు .....
నీ ఛురిక లాక్కొని
నిన్నుత్త చిలకన్జేయక మానదు.....!
యూ మిస్సడే థ్రోట్.....!
ట్రై ఎగైన్.....!

# ఒంచడానికి ఒంగితే చాలనుకుంటాం.... కానీ !

ఐ స్టూప్డ్ టు కాంకర్ హర్...
కానీ
నా తల మీద కాలుపెట్టి పైకిలేచి
నిర్దయగా మబ్బుల్లోకి నడిచి వెళ్లింది -
సరాసరి
తన చాకు దూసి
చందమామ లోంచి వెన్నదీసి
తన వేడివేడి స్లయిస్‌కు రాసుకుందాఁవనే...!

పిచ్చి పిల్ల -
నా చెంప తెగి నెత్తురు కారుతుందనుకోలేదు కాబోలు..
తరవాత గిల్టీగా
తన ఆకులు రాలిపోతూ.. తూ... బిత్తర పోయింది !

పిచ్చి వెధవని...
అప్పటికి.. ఐ ఓన్లీ కాంకర్డ్ హర్... అనుకోని
హాయిగా
నా ఆకాశం అంతా పసుప్పచ్చగా విచ్చుకోని
ఆవిలించాను....
చెరో మూడో రౌండ్ వీర వింటేజ్ బ్లూలేబిల్ తర్వాత
ఆవిడి
విచ్చుకుంటున్న కొమ్మల్ని నేతాకగానే
ధళుక్కున పచ్చల తోరణాలు వెలుస్తాయనుకున్నాను...
కానీ
పకపకా నవ్వుతూ పదమూడు పండు వెన్నెల పాములు
పావు క్షణంలో
ఏ పరగ్రహాల చంకల్లోంచి బిడ్డల్ని లాక్కువచ్చాయో మరి -
నోట కరుచుకొని
పదమూడు మంది పసిడి చంద్రుల్ని తెచ్చి
నా కన్నమ్మ పాదాల మీద పడేసి
కళ్లు మూసికూడా ఆమె సౌందర్యాన్నే నెమరేస్తూ
ఆ కాంతి కిరణం ఎప్పుడు తొణుకుతుందాని
తోక మీద నిలువెత్తు నిలబడి నిక్కి చూస్తున్నాయి ....!

ఇక నా ఒంగుడులో ఉత్త వంకే తప్ప
వరసకు నేనో పథ్నాలుగో అంకెను అవునో... కానో కూడా
తెలియదు కదా...!
పోటీలో ఎంత పోటుగాణ్ణయినా
ఎందుకోగానీ నిరంతరం నే పరాజితుణ్ణే....!

నో... నో.... దేరీస్ నో అదర్ వే
కనీసం ఓ నత్తగా నన్నా మారి
ఓ యుగాంతం వరకన్నా సమాధినై పోతాను...
కనీసం కొత్త యుగంలోనన్నా ఆ కాంతి కిరణం
నా పర్ఫెక్ట్లీ ఫార్ములేటెడ్ పంచవన్నెల షెల్ మీదైనా
మోజుపడి
ముద్దుగా తాకి
కనీసం నా వీపుపైనన్నా ఓ మెరుపు మెరిపిస్తుందేమో....!
అలా కనికరించైనా
నేలలో కూరుకున్న నన్ను తాకడానికి
తానే
ఓ ఇంద్ర చాపంలా ఒంగుతుందేమో....!

ఆ చక్కటి సరళరేఖని
కనీసం అలాగన్నా వొంచగలిగానని
నా సమాధిలోని సిగ్గులేని సూర్యుడు
ఉలిక్కిపడి వెలవెలా వెలిగినా
ఖచ్చితంగా అది నా ఆత్మవంచనే కదా..!
అప్పుడు కూడా విజయం ఆమెదే కదా....!

# ఏడుగురందగత్తెల ప్రియుడు

నాకు తిక్కరేగిందంటే
నిన్ను కూడా
'లె దెమోజెల్ దావిన్యో...' ని చేసిపారేస్తా... జాగ్రత్త...!
అని బెదిరించాను -
అనవసరంగా జుట్టు పీక్కుంటున్న నా కన్నమ్మని...!
అవసరంగానే ముందు నా జుట్టు పీకి
ఆ తర్వాత అనవసరంగా... అంత అందమైన
తన జుట్టునీ పీక్కుంటున్న నా కన్నమ్మని...!

ఆఫ్టరాల్.... నేను ఖవిని కదా -
అనగా
వెయ్యి కళ్లున్న వాడ్ని కదా -
మనం చూడదలిస్తే.... ఇంత విశాలాకాశంలో
ఒక్క... ఒక్కటంటే ఒక్క చందమామే వుండదు కదా..!
వెయ్యి కళ్లతో వెదికితే
వేరే గ్రహాల పక్కల్లో పడుకున్న చందమామలు కూడా
లేచి
వెయ్యి కాంతుల వింజామరలు వీచి
మనం దోచుకోడానికి వీలుగా
మన సందుపక్కనే పొంచి చూస్తాయి కదా....
కదా...!
కదా....!

అలా అనుకోవడం అనుకొన్నానేగానీ
ఆ మాట నే పైకి అనకపోయినా

ఆవిడ వినకపోయినా...
సర్రున ఒక్క చూపుతో
నా బుర్రని స్కాన్ చేయగల నా కన్నమ్మ కళ్ల గురించి
నేనింకేం చెప్పగలను -
తలచుకొంటే
ఆ చక్కటి కళ్లలో చల్లటి చుక్కల్ని మెరిపించగలదు...
కొచ్చటి చిరుకత్తుల్నీ దూయించగలదు....
నెత్తుటి సూర్యుళ్లనీ దూకించగలదు..

'స్టాప్...!
చెడిపోయిన చందమామల మీద
ఛెత్త కవిత్వం చెప్పకు -
ఆ వెధవ ముండల్ని నువ్వు వెయ్యి కళ్లతో వెదికితే
మేం
వెయ్యి కాళ్లతో
నిన్నూ.... వాటినీ కూడా తన్నగలం... జాగ్రత్త....!'
అని తనూ బెదిరించింది...!

కళ్లల్లో చుక్కలే కాదు -
ఈ చక్కటి స్త్రీల బుర్రల్లో
పోలీసు కుక్కలు కూడ వుంటాయి కాబోలు...!
చందమామల వాసనల్ని
చందమామలే బాగా పసిగట్టగలవు కాబోలు...!

కచ్చగట్టి చందమామలు
చండ ప్రచండమైన సూర్యుళ్లుగా మండిపడుతున్నప్పుడు
మనం
ఏ ఎండకా గొడుగే పట్టడం ఆరోగ్యానికి మంచిది కదా -

కాబట్టి... వేంటనే
ముందు బెదిరించిన ' లె దెమోజెల్ దావిన్యో...' ని కాస్తా
ఇన్‌స్టాంట్‌గా తరించడానికి సిద్ధంగా
'న్యాడ్ ఇనే రెడ్ చైర్...' గా మార్చేసుకొన్నాను -
నా మంత్రాలన్నిట్లోకల్లా ఓ వీర యంత్రాన్ని ప్రయోగించి...!
మరేం లేదు -
నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ గాడిలా
చందమామ పాదాల ముందు నీల్‌డౌన్ అయిపోయి...!

కథ అలా...
అప్పటికైతే సుఖాంతం అయ్యింది.... కానీ
ఈ చందమామలు
మన తద్దినాన్ని ఎలా... ఏ రోజున పెడతాయో
అంతా మన రాతల్ని బట్టే... నో...
మన చేతల్ని బట్టే వుంటుంది కదా....!

రాదనుకున్న ఓ అర్ధరాత్రి
బెంగుళూర్నించి బిగ్ బాంగ్‌లాగా వొచ్చి పడి
రెడ్ హాండెడ్‌గా నా రెక్క పుచ్చేసుకుంది...
నా పక్కనున్న పసుప్పచ్చటి చిలకని
చాచి.. చెంపమీద ఒకటిచ్చేసుకుంది...!

కాళ్లా వేళ్లా పడ్డా కూడా వినకుండా
నా కళ్లజోడు పగిలిపోయి
కథ దుఃఖాంతం కావాల్సి వున్నప్పుడు
ఇటు నీల్‌డౌన్లు జరిగినా
అటు కూల్ డౌన్లు జరగవు కదా...!

‘ పింక్ పిరీడ్లో ’ ని
కనీసం ‘కాంప్రమైజ్ కౌగిలి’ అన్నా
సాధ్యం అనుకొన్నాను... కానీ
పెంకిపిల్ల... కొరకరాని కొయ్యగా మారిపోయి
చీకటి గదిలోంచి నిక్కి చూస్తున్న చిలక్కొక్కానికి
తను విడిచేసిన గౌనులా
నన్ను తగిలించేసి
చివరికి నన్నో అర్థహీనుడ్ని చేసి పారేసి
ఆ అర్థరాత్రే వెళ్లి పోయింది...!

చిలకలు.. చందమామల చెకుముకులెన్నున్నా
కన్నమ్మ లేకుండా
బ్రతుకు ఎంత వ్యర్థమో నా కప్పుడర్థమయ్యింది...

కానీ ‘కాపిసో...!’
చేసుకున్నవాడికి చేసుకున్నంత
మళ్లీ మార్గం చూసుకున్నవాడికి చూసుకున్నంత
అన్నారు కదా మీలాంటి పెద్దలు -
మరి
నువ్వు చేసుకున్న... లేదా
పక్కపక్కనే చూసుకొన్న చందమామల
ఆటపాటల్ని ఎంత ఎంజాయ్ చేశావో...
ఆటుపోటులకి ఎగిరి ఎన్ని గంతులేశావో..
నీ గీతల గజిబిజిలోంచి బైటకొచ్చి
తెల్లటి కాన్వాస్‌మీద... నీ నల్లటి నిజాన్ని
కాస్తంత రియలిస్టిగ్గా... నా కంటికీ చూపించగూడదా....?

ఇన్‌స్టెడ్ ఆఫ్ లిక్కింగ్ ఆల్‌వేస్ అవరోన్ వూండ్స్
ఈజిట్ నాట్ బెటర్
టు నాక్ ది డోర్ ఆఫ్ సమ్ గ్రేట్ వారియర్స్ -
హూ ఆర్ ఫేమస్ ఫర్ దైరోన్ ఎడ్వెంచర్స్...?
ఫైనల్లీ... ఫరే ఫ్యూ బిట్స్ ఆఫ్ ఎడ్వైజెస్...!
ఫరే ఫ్యూ ఇన్‌స్టాన్టేనియస్ ఇన్‌సైట్స్...!

అవును.... 'సోపికా'...!
అంత వల్గర్‌గా... నిన్నా బీచ్‌లో పట్టుకొని
'ఓల్గా' ఉప్పెనలాగా వొచ్చి
నువ్వు తేలాలనుకొన్న కొత్త కెరటాల ముందే
నీతో ఉప్పునీళ్లు తాగించినా
గప్పు చిప్పున ఎలా గుటకలు మింగగలిగావో
ఇప్పుడన్నా కాస్తంత నోరు విప్పగూడదా...?

అయితే గాడెసెస్....
లేదా డోర్ మాట్స్... అటకదా స్త్రీలు నీకు...!
నో డౌట్.... నాకూ అంతేలే కానీ
ఈ దేవతలు... అండ్.... డెవిల్స్
ముందు జుట్టూజుట్టూ పట్టుకొని... తర్వాత ఇద్దరూ కలిసి
ఒకేసారి మన గొంతు పట్టుకొంటే..
ఆ పట్టుఎలా విడిపించుకోవాలో.... మరి
ఆ గుట్టేదన్నా వుంటే.. నీ గుప్పెట విప్ప గూడదా...?
నీ రంగులన్నీ నీలి సముద్రంలో కలగలిపి
ఆకాశాన్నే కాన్‌వాస్‌గా నీ కుంచెతో విన్యాసాలు జరిపి
ఎవరి బొమ్మని గీస్తానని.... వెంటపడ్డావో -
ఎవరి అడుగులకి మడుగులొత్తుతూ.... ' గోడుగుపట్టావో ' -

ఆ 'జీలో'...
ఉన్నవాళ్లుండి.. ఉన్నట్టుండి... 'ఛలో....!' మంటూ
నీ కాన్‌వాస్‌ని కూడా చించుకొని
చి.... చ్చిలకగా మారి ఎందుకెగిరిపోయిందో
మాకు చెప్పకపోయినా -
కనీసం... ఆ చిరిగిన కాన్‌వాస్‌నన్నా చూపించవయ్యా....!

నీకు కాన్‌వాస్‌లు చిరగడం
నాకు కళ్లజోళ్లు పగలడం.... మామూలేగానీ
మన గుండెలు కాలడం..
నిరంతరం కాలుతూనే వుండాలి కానీ -
కొత్తగా నెత్తురు కారడం... కూడదే..!
మన చరిత్రలో
మెత్తగా విచ్చిపోవడం అంటూ వుండదే....!

కానీ... ఏమైంది నీకు....?
తొమ్మిది వారాలు నీ గదిలో ఒంటరిగా కూచోని
నీ గుండె గోడల మీద గీసిన
తొంభయివేల గీతలన్నీ
తెల్లటి పావురాలుగా మారిపోయి
తియ్యటి పాటలు పాడుతున్నాయేమిటీ...?
నిజంగా..... 'జీలో'... నీ గుండెని కోస్తే
నీ కన్నీళ్లు
నల్లటి కాకులుగా మారి.... కావుకావుమని అరవాలిగానీ....!

ఇంతకీ నీది... విరహ శోకమా....?
కొత్త కోరికల ..... కోరియర్ కపోతమా...?
కుంచె... నీ గుండెలో ముంచి

కొంచెం చూపించవయ్యా -
నీ నెత్తురు ఎఱ్ఱని ఎరుపో...!
తెల్లని తెలుపో....!
పోనీ... ఎఱ్ఱని తెలుపో...! తెల్లని ఎరుపో...!
లేదా నల్లని నలుపో...!

తప్పదు.... ' పిసోకా '...!
తప్పదు... నువ్వు నిజం చెప్పక తప్పదు -
నీ ప్రాణం
ఆ పంచవన్నెల చిలకలోనే వుందని చెప్పావా.... లేదా...?
మరేం ఫరవాలేదు.... చెప్పూ -
ప్రతి చందమామతో.... నేనూ అలాగే చెబుతాలే...!
అన్ని పంచాంగాలూ... విప్పితే ఒకటేలే...!

కానీ
తిక్క తగ్గింతర్వాత.... చిలక తిరిగొచ్చి
నీ ఎఱ్ఱటి... నో... తెల్లటి... నో... నల్లటి... నో...
నువ్వే రంగో ఎవరికీ తెలియనట్టి
నీ ఇంద్రజాలపు కొంటె కుంచె మీదే వాలినా...
నీ చిలక తిరిగొచ్చి నీ కుంచె మీదే వాలినా...
వాలినా... వాలినా... నా...
పైకి... పైపైకి చూస్తూ... చుక్కల్ని ఎందుకు లెక్కబెట్టావో...
ఎదురుగా చిలక ఎఱ్ఱగా ఒళ్లు విరుచుకొంటున్నా
చల్లగా...
నీ కాన్వాస్‌లో నువ్వే... నల్లగా
ఓ చార్‌కోల్ బొమ్మగా... ఎందుకు మారిపోయావో...
ఒక్కసారి నా ముఖంలోకి చూసి చెప్పవయ్యా -
అసలు నీకెన్ని ముఖాలున్నాయో...!

కళ్లు చేతుల్లో వున్నాయో...!
కాళ్లు చెవుల్లో వున్నాయో...!

నువ్వు చెప్పకపోయినా
నాకు మాత్రం తెలీదా -
ఎంత పిచ్చి ప్రేమికులం అయినా
మనంవంతా పచ్చి జాగిలాలంవని....!
మన కళ్లలోంచి నాలికలు వేలాడతాయని...!
మన తలల్లోంచి కబంధ హస్తాలు మొలుస్తాయని...!

నాకు తెలియదా -
పాత చిలక ఇలా ఎగిరిపోయి....
అలా తిరగొచ్చేంతలోనే... నీ గుండె
కొత్త చిలక... 'జాక్ లీన్' గాలానికి
హుక్కయి వేలాడుతోందని...!
నీ కుంచె సరికొత్త కోరికల కుక్కై
రంగు రంగుల సొల్లు కారుస్తోందని...!

నీలాగే
నా గుండెకూ... వుండటానికి రెక్కలెన్నున్నా
వెండి మబ్బుల్లో.... ఎన్నెన్ని రంగుల్లో ఎగిరినా
ఒక్కోసారి మాత్రం.. రెక్కలు తెగి...
రెక్కలే కాదు.. ఎక్కడో రక్త నాళాలు కూడా తెగి
తిరిగి నా కన్నమ్మ కోసంవే.... తొణికి
గుండె చటుక్కున.. తిరిగి నా గుప్పెట్లో కొచ్చేస్తుందయ్యా...!
చడీ చప్పుడు కాకుండా.... ఒక్కో చుక్కా...
ఆగకుండా నెత్తురుకారుతూనే వుంటుందయ్యా...!

ఐనో... ఐనో....!
ఇలా చతికిల పడిపోతే లాభంలేదని...!

నిరంతరం వెదకడం మాన కూడదని...!
ఎంతైనా
ఏడుగురందగత్తెల ఏకైక ప్రియుడివి -
కొంతైనా నీ కుంచెనించి
వింత వింత రంగులేయడం నేనూ అలవరుచుకోవాలి...!
కాంతల కన్నుగప్పే విద్య నీ నించే నేర్చుకోవాలి...!

పోస్ట్ పోయమ్ :

కాన్వాస్మీద నిజంవో..... అబద్ధంవో
గీస్తే
నిలువుగా... అడ్డంగానే గీయాలి కానీ
ఒకేసారి నలువైపులా చూసే
అడ్డదిడ్డాల ఆకారాల్ని
పాతాళంలోంచి తీసి... ఆకాశంలోకి విసిరే
ఈ ఘనాపాఠి ఎవరో తెలుసా....!

తెలిస్తే -
ప్రేమగా తలచుకోని
ఆ రంగుల కుంచెని ఓసారి గుండెలో ముంచుకో....!
తెలియకపోతే -
పోనీ... ఓపిగ్గా తెలుసుకో....
పిసోకా....! సోపికా...! కాపిసో...!

ఈ గందరగోళంలో
ఏ తలకిందులుగానో... ఏ సుదూర శూన్యంలోనో
వేలాడుతూ...
ఏ చిలకనో... చందమామనో..
ఎవరేంవిటో తెలియకుండా
ఇంకా పెయింట్ చేస్తూనే వుంటాడు...!

# పురుషాద్వైతం

లక్ష్మి పరమ చంచల కదా -
ఆవిడ్ని
కన్ను గీటిన ప్రతివాడి చేతికీ చిక్కకపోయినా
ఏం చూస్తుందో మరి -
చిక్కదలుచుకున్న వాడి చేతిలో ఏ రేఖనో...!
నుదుటి మీద ఏ గీటునో...!

చిక్కాక
ఆ అదృష్టవంతుడి కౌగిలికి దక్కాక
మరి.... మన మగా విష్ణువుగారి పరిస్థితేంవిటి....?
నచ్చినోడితో
హాయిగా గాలికి తిరిగే పెళ్లాంతో
గరుడ వాహనుడి గతి
ఉత్త ఈకల్ని లెక్కబెట్టుకోడంవేనా..?
నో....!
ఎంతైనా నల్లనివాడు
నాలుగాకులెక్కువే చదివినవాడు కదా -
ఎలాగూ ఆవిడ ఒక చోట నిలవదు కాబట్టి
ఆవిడ నెలకొన్న ప్రతివాడి శివంలోనూ
తన శిరాన్ని జొనిపి
ప్రతివాడూ... తన అవతారంవే అనేస్తాడేమో....!

నన్నడిగితే
నథింగీజ్ రాంగ్...!
ఖారు ఖెమికల్ రిలేషన్‌షిప్స్‌లో
ఇటూ అటూగాని విశిష్టాద్వైతాన్ని దాటి
అంతా నేనే అనే గొప్ప అద్వైత స్థాయికి చేరితేనేగానీ

పురుషుడు
ప్రతి పురుషుడి లోనూ తన్ను చూసుకోలేడు...!
తన స్త్రీ మీద ఎంత ప్రేముంటే తప్ప
ఆవిడి ప్రతి ప్రియుడూ
తానే ఎలా కాగలుగుతాడూ...?
తన అట్టడుగు రసాన్ని ఎలా జయించగలుగుతాడూ..?

ఆ రస్సైక విషాన్నే జయించమని చెప్పి
పదహారు వేల మంది గోపికల్ని
ఒక్క కృష్ణుడి చుట్టూ కోరిన వాడే
ఒక్క 'శ్రీ' చుట్టూ
పడిచచ్చే
పది వేల కోట్ల మంది పురుషుల్ని కూడా
భరించక తప్పదు కదా....!

తప్పదు -
తిక్కకుదరాలంటే
మగవాడి బొడ్డులోంచే
ఓ తామర పూవు పూయక తప్పదు...!
ఆ పిచ్చి పద్మంనించే
పరబ్రహ్మ(వూ పుట్టకా తప్పదు...!
తప్పదు -
నా కన్నమ్మ పదివేల కన్నుల్లోంచీ
నే భరించలేని రంగుటద్దాలెన్నున్నా
అన్నిటా నేనే ప్రతిబింబించక తప్పదు...!
అన్ని రంగులూ నేనే కాకా తప్పదు...!
కాదా కన్నమ్మా...!
ప్రేమ గుడ్డిది...
అద్దాలు దాటి చూడగూడనంత దొడ్డది...!

# తీగలెప్పుడూ చుట్టుకుంటాయిలే గానీ....!

హో రి స్సోదర్రుల్లార్రా....!

నోళ్లతో
నిరంతరం పూలే పూస్తాం కాబట్టి
అవతలి స్త్రీకి కళ్లలో
నిరంతరం కాంతి వలయాలే తిప్పుతాం కాబట్టి
అమాంతం మనం ఉత్తములం అయిపోతాంలే కానీ
ఇవతలి స్త్రీ చిత్తంలో మాత్రం
మనవుత్త ఛత్తములవే కదా...!

అబ్బెబ్బే.....!
మగవాళ్లందరం 'మిష్యూవెర్డ్గా' లవే అనడం లేదులే....
మనకా ఛాప్లినిక్ ఛామ్ మాత్రం ఎక్కడేడ్చింది గనక -
తర్వాత అవతలి...... ఇవతలి స్త్రీలందర్నీ
గొంతుపిసక్కుండానే ప్రాణాలు గాల్లో తేల్చడానికి....!
కనీసం
'మార్క్ హర్మన్ ' లాగా గ్రీక్ గాడ్లం కూడా కావు కదా -

'వర్త్ విన్నింగ్ ' అని
వొంతులేసుకుమరీ ఆడవాళ్లని
గంతులేస్తూ మన చుట్టూ తిప్పడానికీ...!
తర్వాత వాళ్లు
మన తలల్ని కత్తి పీటల్తో తరగడానికీ....!

పోనీ మనం
పాత చెట్లని నరక్క తప్పదు -
కొత్త తీగల్ని పెంచడానికి అని
ఎండ తీవ్రతకి సిద్ధాంతీకరిద్దాంలే కానీ
మరి
మనల్ని చుట్టుకోని పెరగడానికి
ఆ తీగలు పిచ్చిపూలు పూయడానికీ
మధ్య
మన మగమానులు
నిలచున్న నేలలోనే పాతుకు పోతాయన్న గ్యారంటీ లేదు కదా....!
పోనీ
'గ్యారంటీ... గ్యారంటీ...!' అంటూ
నెత్తిమీద ఆకు పచ్చటి కొమ్మలాన్ని ఒప్పుకొన్నా కూడా
ఏ క్షణాన్న
మన కాళ్లు రింగు రింగు చక్రాలుగా మారతాయో
మనకే తెలీదు కదా...!

దెన్.... వాటెబౌటె టిట్‌ఫర్ టాట్....?
మనం కదిలేలోగానే ఏ క్షణాన
మన పాత లతలు కసిగా....... పొరలు విచ్చి నగ్నంగా

మన ఒంటి చుట్టూ విద్యుత్తీగ తెమ్మెరలై
భగభగ మండుతూ పాకుతాయో
మనకు తెలిస్తావదు గదా....!
ఆ దేవుడూ మన మగవాడే అయినా
'మరుక్షణంలో నువ్వు మసిబొగ్గుగా మారబోతున్నావురా... వెధవా!'
అని కూడా
మన చెవిలో గడియముందైనా ఊదలేడు కదా....!

బెస్ట్ -
మన మనసులు ప్రతి తీగకీ రగిలి
రంగుల చక్రాలుగా మారడం మానమని చెప్పడం లేదులే
కానీ....
మనం పాతి పెట్టిన ఆడకాళ్లకూ
కాస్తంత కదలికల్నిచ్చి చూద్దాంవా -
వాళ్ల కాళ్లు
మన మూతి మీద తన్ని పోతాయో..!
భూమిలోంచి బైటికి తీసినా
ముడుచుకొని మూల చేరతాయో....!

పోస్ట్ పోయమ్ :

మనవే బైటకి తీసినవి
బహుశా ముడుచుకొని మూలే కూచుంటాయి...!
మనల్ని మూతి మీద తన్నగలిగేవి మాత్రం
ముందే ముళ్ల చక్రాలుగా మారిపోయుంటాయ్.....!
కాస్తంత
కనిపెట్టుకో స్సోదరా.....!

# బాధ బాధే....!

భయమేవీ లేదు
బిథోవిన్లోకి తీసికెళతా రండి...!
కాకుంటే
లోయలోకి దూకేప్పుడే
క్షణం కళ్లు మూసుకోవాలి..... అంతే !

మీ నాన్నలూ.... మొగుళ్లూ
ఎక్కమన్న కొండలు ఎక్కడంలో భయం లేదూ...?
మీ ఎగబ్రాకడాల్లో
కనీసం మౌంటెనీరింగ్ థ్రిల్లన్నా వుందా....?
మిమ్మల్ని ఎక్కించే కొండలన్నీ
నిజానికి ఉత్త జారుడు బండలు కావూ...?
పిచ్చి మొహాలూ...!
మీ వుత్త తలక్రిందులు జీవితాలు కాకపోతే
జారుడు బండల్ని
ఎక్కడన్నా కిందినించి పైకి పాకుతారా....?
హాయిగా
జర్రున పైనించి కిందికి జారాలి గానీ....!
మీ ముఖాల్ని మూసిన
మర్యాదల మాస్కులు పగిలి నవ్వాలి గానీ...!

జస్ట్.....
మీ ముఖాల మీద మధురమైన ఎక్స్‌పెక్టేషన్స్‌తో
ముసి ముసిగా నవ్వుతూ
మీ కోరికల కొండ అంచున
మీ మునివేళ్ల మీద నిలబడండి.. చాలు...
మిమ్మల్ని
'తొమ్మిదో సింఫొనీ' లోకి తోసేస్తా.... అంతే !

బాధ బాధే...!
కాకుంటే మీరు కాకుండా
మీ నాన్నలూ.... మొగుళ్లూ కోరుకొనే
ఒక్కోసారి
మీ అమ్మలూ... అమ్మమ్మలూ కూడా గోళ్లు గీరుకొనే
కొండల్ని
మీరు ఎక్కడంలో మాత్రం
కాళ్లు గ్యారంటీగా జారతారు... కానీ
మీరు కోరుకున్న సముద్రాల్ని సొంతం
తలచుకొంటే....... తప్పకుండా ఈది తేలతారు...
అంతే బేధం....!

కానీ
ఈ రెంటి బాధల మధ్యా
ఆనందపు అగాధం ఎక్కడవుందో మీకూ తెలుసు...!
ఊ...! దూకండి...!

కన్నమ్మా...! నీకు తెలీదా -
నా కన్న కూతురికైనా నే చెప్పే పాఠం ఇదే...!

# హెచ్చవేతలు.... తీసివేతలు

నువ్వు
మొట్టమొదటిసారి నాక్కనిపించినప్పుడు
నన్ను
నాలుగు పెట్టి హెచ్చవేసుకున్నాను కదూ...!
నువ్వమాయకంగా
నా నాలుగింతల అబద్ధంలోంచి
నీ కొండంత నిజాన్ని తేలిగ్గా తీసేసుకొని
నిన్ను నీవు తగ్గించుకొని
నాకు నన్ను పెంచుకోనిచ్చావు కదూ...!

కన్నమ్మా...!
నిజానికి నేనొక్కడ్నే వెధవననుకొన్నాను -
కానీ
నేనుత్త నాలుగైతే
ప్రతి వెధవా
పధ్నాలుగింతల ఫాల్సు పర్సనాలిటీలు...!
ఎన్ని వెదికినా
అన్నీ..... ఉత్త ఓటి కుండలు...!

నిజంగా అద్భుతం.... మీ ఆడవాళ్లు...!
ఎంత హెచ్చించుకున్నా
ఎంత గొంతు చించుకున్నా
మాఁవుత్త ఓటి మోతలే కానీ
ఎంత తీసేసుకున్నా
మీరు నిజంగా నిండు కుండలు...!

పోస్ట్ పోయమ్ :

కానీ.... కన్నమ్మా !
స్థూలం ఎప్పుడూ అబద్ధం కాదులే కానీ...
సూక్ష్మంగా చూస్తే
ఒక్కోసారి...... తిరిగి భయఁవేస్తోంది....!
మీ ఆడవాళ్లల్లోనూ
మగవాళ్లు కూడా వున్నారా....?

# మహాశక్తి

మనకు

మహా యోగినులు ఎక్కడ దొరుకుతారు...!

మనవేవన్నా

రామకృష్ణ పరమహంసలవా-

సాక్షాత్తూ

'భైరవీ బ్రాహ్మణి' బ్రహ్మోపదేశం చేయడానికి...!

మహాపద్మ ప్రవేశయోగం కల్పించడానికీ...!

పోనీ

మహాశక్తులన్నా మనకెక్కడ దొరుకుతారూ-

మనం

మగ మహారాజులం అనుకొంటూ విర్రవీగుతున్నప్పుడు...!

బిర్రబిగిసిన మన అహంకారాలు
హయ ధ్వజాలై విజృంభిస్తున్నప్పుడు...!
అనవసరంగా ఆహాకారాలు చేస్తూ
ఎంతెత్తు కొండలెక్కినా
అరక్షణంలో అథఃపాతాళాలకు కూలిపోతున్నప్పుడు...!

కనీసం
మనం మంచి మనుషులంవన్నా అయితే
మన మహాశక్తుల్ని
మనంవే సృష్టించుకోవచ్చు-
మన అదృష్టంలో వున్న ఒక్కో మామూలు స్త్రీలో కూడా
అస్పష్టంగా వెలిగే గుడ్డిదీపానికి మనం
కాస్తంత తైలంవీయగలిగితే...!

తలచుకొంటే
మన నిండు చందమామని మనంవే సృష్టించుకోవచ్చు
అమావాస్యలో కూడా
సూక్ష్మాతి సూక్ష్మంగా
ఓ వెన్నెల మొలక నక్కి దాగుంటుందని గ్రహించగలిగితే...!
కళ్ళు మూసికూడా మనం మన భృకుటి మధ్యంలో
మనసు తెరిచి చూడగలిగితే...!

ముందు మనం
మద గజాలం కాకపోతే...!
పురుషుల బీజసూక్ష్మం మనం కనగలిగితే...!
స్త్రీల క్షేత్ర ధర్మం
మనవల్ల చెడకుండా మనగలిగితే...!

కాదా కన్నమ్మా...!
అతి సామాన్యులం మనిద్దరం అదేగదా చేశాం-
నన్ను నవ్వు సృష్టించుకొన్నావు...
నిన్ను నేను సృష్టించుకొన్నాను...
నిన్ను మించిన మహాశక్తి నాకింకెవ్వరు...!
నన్ను మించిన మహాశివం నీకెవ్వరు...!

భూమి
పైపొర చల్లారినంత మాత్రాన
ఆ తల్లి గర్భంలోని మహాజ్వాలా పర్వతం
ఇంకా చల్లారలేదని
చల్లారదని
మనం గ్రహించగలిగితే
భక్తితో కళ్ళు మూసుకోని
రక్తితో గుండెమీద వామహస్తంవిడుకొని,
'నమో మాతా...! నమో జగజ్జననీ...!'
అని మనసులో అనుకొని
మధురమైన భావంతో
మనంవా అగ్ని గుండంలో దూకగలిగితే
మన మామూలు స్త్రీలే
మహా శక్తులెందుకు కారు...!
అహం చస్తే మనం కూడా ... ముందు
మహా శిలలం ఎందుకు కాంవూ...!
తర్వాత... మహా శివులుగా ఎందుకు మారం...!

# మధుర మృతి

నీ కాళ్ళముందు సముద్రం పొంగుతున్నప్పుడు
వెల్లికిలా
చల్లటి ఇసుకమీద... నగ్నంగా పడుకొని
నల్లటి చీకటిలో
తెల్లటి చుక్కల్ని ఎప్పుడన్నా లెక్కబెట్టావా...?

తొమ్మిది తొమ్మదుల పాటు
నాసిక నించి నాభిదాకా
మరో తొమ్మిది తొమ్మదులపాటు
వజ్రమూలం నించి పద్మకలశం దాకా
ప్రాణాన్ని ప్రవహింపజేసి చూడు-

నీలి పొరల్ని చీల్చి
ఎర్రని రూపుదాల్చి
నగ్నంగా నిండు చందమామే దిగివచ్చి
శివ శిరాన్ని
తన మహా పద్మముద్రలో బంధించి
మహా యజ్ఞానికి సిద్ధమౌతుంది...!

కాదా కన్నమ్మా...!
మా మగ వెధవల్లో చాలా చాలా మందికి
'మధుర మృతి' మర్మం తెలియదు కదూ...!
కానీ మదపు గుఱ్ఱాలఁవనుకుంటారు... మూర్ఖులు-
పరుగు ప్రారంభించగానే
పదహారు పల్టీలు కొడతారు...!

అసలు
పరిగెత్తమని ఎవరు చెప్పారూ...!

కర్మ తనదని
కర్మణి తన స్త్రీ అనీ కదా వాడి కుంటి తత్వం...!
వాడి వొంటి తత్వం వాడికే తెలియని వాడు
కొంటె గుఱ్ఱాన్నను కోవడం ఎందుకు...!
కుంటి కాలి పరుగులెందుకు...!

అసలు
పరుగెందుకు...!
పురుష హితం
పురుషాయితఁవే కదా...!

ఓ మహా యోగినీ...!
నువ్వు నేర్పేదాకా నాకు మాత్రం నిజం తెలిసిందా-
నీ మహా యజ్ఞంలో
ముందు నేనో సమిధ మాత్రాన్నే నని...!
మండి మధురమైన విద్యుల్లేఖగా

ప్రథమ నృత్తం చేయవలసిన
మహాశక్తివి నువ్వే...
కేవలం నువ్వేనని...
నాకు మాత్రం తెలిసిందా-
నన్ను నిట్టనిలువునా తగలబెట్టేదాకా...!

ఓ మహామంత్రం
మా మగ వెధవలకి చెప్పమంటావా...?
'మహాపద్మధారణం శివహితం...
మహా చక్ర మథనం పూర్ణం శక్తిమతం...!'

శివుడు చేయవలసిందల్లా
పది తలల రావణ బ్రహ్మగా మారి
ఆ మృదుమధురమైన మబ్బుల సముద్రానికి
మధ్యే
మహా మేరువై... మహా స్థాణువై
మరులుగొన్న మహా యోగియై
'వజ్రోలి'లో జ్వలిస్తూ
ఆ బ్రహ్మండాన్ని కాసేపు భరించగలిగితే చాలు-
ఇక
దేవతలు... దానవుల ఇద్దరి వంతు
మహా మథనాన్ని జరిపించే పూచీ
ఆ మహాశక్తిదే...!

కన్నమ్మా...!
నా మహాశక్తివినువ్వే..!
నా మహాయోగినివీ నువ్వే...!

తొమ్మిది తొమ్ముదులపాటు
నాసిక నించి నాభిదాకా
వజ్రమూలం నించి పద్మ కలశం దాకా
ప్రాణాన్ని ప్రవహింపజేయడంవే
నా కర్తవ్యం కదూ... కన్నమ్మా...!
అగ్నిపర్వతం పగిలేదాకా...!
మంచు సముద్రం పొంగే దాకా... !

ఓ మహా యోగినీ...!
ముందు
నీ పాదపద్మాలకింద
నలిగి
నవ్వుతూ మృతి చెందడం వే కదా నా ముక్తి...!
ఆ 'మధుర మృతే' కదా నా శివశక్తి...!

మృతి చెందితేనే కదా
తిరిగి జన్మించడం...!
తిరిగి జన్మించితేనే కదా... నా శివుడు
ప్రళయ నృత్తం చేయగలగడం...!
పర్వతాలు పగలడం...!
సముద్రాలు పొంగడం...!
అసలు లేకుండా పోవడం...!
మళ్లీ పుట్టడం...!
మళ్ళీ చావడం...!
మళ్ళీ పుట్టడం...!
అంతా ఎంత మధురం...!
కన్నమ్మా...! ఎంత మధురం...!

# ఉన్న మాట - ఉలికిపాటు !

అబద్ధాలు చెప్పేవాడ్ని ఎలా అయితే నమ్మకూడదో అలాగే నిజాలే చెప్తానన్న వాడిని కూడ. అయితే కవిత్వం మీద ఒట్టేసి చెప్తానన్నపుడు కొంచెం నమ్మాలేమో, "Poetry is the direct quotation of the mind" అన్నారు కదా - అందుకని!

కన్ఫెషన్ అనే మాట వినగానే - ముఖ్యంగా కవుల కన్ఫెషన్స్ అనగానే, వాళ్ళ "language in which they make love" ని వినగానే మనకు చెవులూరుతాయ్. "చెప్పు; చెప్పు ఇంకా చెప్పు; ఇంకా ఏం చేసావ్ చెప్పు" అని మనం తొందర పెడతాం; రోమన్ కాతలిక్ ప్రీస్ట్లా. " You have to bribe the Priest if you want to legitimate the bastard. " కదా!

ఇతరుల ప్రేమ కవితలు మనల్ని ఆకట్టుకోవు. మనం ఊకొట్టం, (ఈర్ష్య కదా!) ఇతరుల కామ కవితలు అంటేమాత్రం మనం చెవి కోసుకుంటాం, చెవులూరిస్తాయ్ అవి.

కవులు కీర్తిశేషులైన తర్వాత వాళ్ళ అస్తిత్వపు రహస్యపు బీరువాల్లోంచి, అరమరల అరల్లోంచి కొన్ని కొన్ని అస్థిపంజరాలు అపుడపుడు బయటకు తృళ్ళి పడుతూంటై. కీట్స్, షెల్లీ, వర్డ్స్‌వర్త్ లిత్యాదులూ వీటికి అతీతులేమీ కాదు.

చదవండి - " The Erotic World of the Faery" అన్న Maureen Duffy రాసిన గ్రంథం. సెంట్ అగస్టీన్ "కన్ఫెషన్స్" కీ రూసో "కన్ఫెషన్స్" కీ మధ్య ఆవులించిన ఆకాశమంత దూరం ఉంది. ఇహ పర ప్రపంచాల రెండు అనంత దూరాలున్నై. మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్ తర్వాత కూడ గాంధీ గారు ఇంకా తనని తాను పరీక్షించుకొన్నారు కదా.

అయితే మనం ' మై సన్స్ ఫాదర్ ', ' మైగాడ్ డైడ్ యంగ్ ', 'యాన్ ఆల్ఫబెట్ ఆఫ్ లస్ట్ ' లాంటి స్వీయ చరిత్రలను మరొకందుకు చదువుతాం. కవులూ రచయితలూ వాళ్ళంతట వాళ్ళుగా 'కన్ఫెస్' చెయకపోతే వాళ్ళ సన్నిహిత మిత్రుల నోటి నుంచో కలాల నుంచో మన కుతూహలాన్ని తృప్తిపరచుకొనే ప్రయత్నాలు చేస్తాం. నయీపాల్ మీద అతని దీర్ఘకాల మిత్ర నవలాకారుడు పాల్ తొరాక్స్ - 'సర్ విదియాస్ షాడో ' లో ఏమిరాసాడోనని తొంగి చూస్తాం. కవుల యుటోపియా నుండి మనం పోర్నోటో పియా (డానియల్ బెల్ కాయినేజ్) ల లోకి ప్రయాణిస్తాం.

"ఎంకెవ్వరని లోక
మెపుడైన కదిపితే
వెలుగు నీడల వైపు
వేలు సూపింతు"

నని కవులు మొహం చాటుచేసుకొంటారు. అయినా 'సంధ్య' చిర్నామా చేజిక్కించుకొందామనే ప్రయత్నం మాత్రం మానం. శ్రీశ్రీ "అనంతం" లోని 'కోకోజం' ని ఒకసారి చూచిరావాలనిపిస్తుంది. అర్ధనిమీలిత నేత్రాలలోని నిజమైన 'రాక్షసరతి' అర్థం మరెలా అందుతుంది పాఠకుడికి! చలం స్వీయ జీవిత చరిత్ర చదవకుండా ఆ నిమ్నోన్నతాలనెలా చేరుకోగలం మరిక?

కవి నార్సిసస్, పాఠకుడు వాయెరిస్ట్. మనందరిలోనూ 'స్కోపో ఫీలియా' ఉంటుంది. (లైంగిక దృశ్యాల నుంచి కనులు తిప్పుకోలేని బలవత్తరమైన కాంక్షా వీక్షణం).

కవి భాషకి పుంస్త్వాన్నిచ్చినపుడు పఠన క్రియలో పాఠకుడికి అనుభూతి అనేది ఒకానొక మానసికానుభవంగా పతాక స్థాయికి చేరుకుంటుంది. కవిత్వం భాష యొక్క భావ ప్రాప్తి (orgasm) అనొచ్చునేమో!

సుజాతాభట్ అనే గుజరాతీ స్త్రీవాది రాసిన "చెరుగ్గడ" అనే కవిత. (అనువాదం-ఇస్మాయిల్) చదవండి.

## చెరుగ్గడ

చిన్నప్పుడు సనో్స్రా లో
చెరుగ్గడ తినటం నేర్చుకున్నాను :
తొక్కని పళ్ళతో చీల్చి
తెల్లటి కండని కొరికి
పళ్ళతో అదిమి పీలిస్తే
చెరకురసం ఉబుకుతుంది.
శీతకాలం ఉదయాలు
లేత చెరుగ్గడల్ని కోసి మా
రైతు పట్టు కొచ్చేవాడు.
మధ్యాహ్నాలు
పెద్దవాళ్ళు నిద్ర రోయాక
నున్నటి పొడుగాటి గెడల్ని
బైటకి చేరేసే వాళ్ళం.
మా చుట్టూరా వెచ్చటి యెండ,
మగతగా ఆవులించే కుక్కలూ.
దంతాలు గట్టిపడేవి,
దవడలు మొద్దుబారేవి !
చెరకురసం గంటలకొద్దీ
చీకుతూ కూచునేవాళ్ళం.
చేతులు జిడ్డెక్కిపోయేవి.
ఐతే, ఇవాళ రాత్రి
పళ్ళతో కొరికి
బాగా చీకమని నువ్వన్నప్పుడు,
నీ జుత్తు చెరకుగడ్డి వాసనేస్తుంది.
చెరకు తోటలో చెరుగ్గడ వైపోతావు.
ఇరు పక్కలకీ ఒత్తుకుని
చెరకు పొదలు మనకు దారిస్తాయి.

ఈ కవిత సుమారు ఓ పదేళ్ళ క్రితం ఓ ఆదివారం హిందూలో (!) సాహిత్య పుటల్లో ప్రచురితమైంది. వడ్డెర చండీదాస్ ఆ కటింగ్‌ని నాకిచ్చి తెలుగులోకి అనువాదం చెయ్యమని అడిగారు. ఆ పని ఆలోగా ఇస్మాయిల్ చేసేసారు.

భాషకి పుంస్త్వాన్నివ్వటం అంటే లైంగిక ప్రతీకల్ని వాడటమే ఆ లైంగికతని కవయిత్రులు కూడ ఇవ్వగలరని ఎన్నో ఉదాహరణలతో నిరూపించవచ్చు. పెన్సిల్, కత్తి, పాము, పాముపుట్ట, పిల్లన గ్రోవి, అద్దం - మెదడులో దీపం; ఇవన్నీ లైంగిక ప్రతీకలే.

'చెరుగ్గడ' కవితలో గడ, తొక్క, కండ, రసం, గడ్డి-లాంటి పదాలు ఫెలాషియో అనే నిషిద్ధ (?) లైంగిక క్రియకు సూచికలు. మరొక నిషిద్ధ ప్రక్రియ అయిన కనిలింగస్‌కి ఉదాహరణగా ఈ కవిత చూడండి :

రోజా మరియా రాఫిల్ అనే మెక్సికన్ కవయిత్రి రాసిన Gioconda అనే కవితకి జయప్రభ అనువాదం (చింతక నెమలి P. 35-36)

## ఆరని చిరునవ్వు

నా జననాంగం ఒక మృదు పుష్పం

అది ఒక ఆల్చిప్ప
ఒక అత్తి పండు
అతి మెత్తటి ముఖమల్ వస్త్రం
అనేక సుఖాల.... సువాసనల..... రుచుల
సమృద్ధి భరితం !
అది మృదువైనదీ ! నాకు సన్నిహితమైనదీ !!

నాకు సరిగ్గా పన్నెండేళ్ళప్పుడు
దానిపై మొలకలొచ్చాయి
అప్పుడే కొత్తగా దూది మబ్బులు
నా తొడల మధ్య ప్రవేశించాయి

అది స్పందిస్తుంది... స్రవిస్తుంది...
కోపిస్తుంది కూడా !
ద్రవాల ప్రకంపనాలతో నాతో మాట్లాడుతుంది

అది నాలోని మరోస్వరం !
నీటి గొట్టంలా నన్ను నిలువెల్లా తడిపేసే
దాన్నిండా చిలిపితనమే ! నిర్లక్ష్యమే !!

చుంబించే నాలికలంటే దానికెంత ఇష్టమనీ !!
తూనీగల్ని చూసి ....
ఎగిరే సీతాకోక చిలకలనుకుంటుంది !

గట్టిపడిన పురుషాంగాలన్నా దాని కెంతో ఇష్టం !
అది.....
చిక్కటి కోర్కెల ద్రాక్షగుజ్జు !
ప్రియమైన లలిత చుంబనస్పర్శ !!
అది...
నా నల్ల చిరుత
కొమ్ముల దుప్పి
కుందేటి పిల్ల!

అది రతీదేవి
దాన్ని రెచ్చగొట్టకు
ముకుళించుకు పోగలదు సుమా !
దాన్ని బాధ పెట్టకు !!

అది నా తోడు దొంగ .....
నా ప్రియసఖీ కూడానూ !
వెరసి ..... అది,
ఆనందమయమైన స్త్రీ వదనంలోని
ఆరని చిరునవ్వు !!

"The vagina is a wound that never heals up"అని నార్మన్ మెయిలర్ అన్నందుకు అతన్ని ఆరోజున prisioner of sex అని ఆడిపోసుకున్నారు స్త్రీవాదులు. నిజానికి గాయాన్ని గురించే మాట్లాడడతడు. బాధ గురించే మాట్లాడాడు నిజానికి.

" పురుషావయవం ఒక మంత్రదండం
స్త్రీ గర్భాశయం ఒక వసంతవనం" అని గిన్స్‌బర్గ్ తన మంత్ర దండోచ్చారణ చేస్తే

" A candle in the thighs
Warms youth and seed
And burns the seeds of age
Where no wax is
The candle shows its hairs" అని దిగాలు పడిపోయాడు డిలన్ థామస్.

స్త్రీ జననాంగాన్ని ఓ మృదుపుష్పంగానూ చూడవచ్చు. ఎప్పటికీ మానని గాయంగానూ దర్శించవచ్చు. తేడా అల్లా 'ఆరని చిరునవ్వు' కవితలో ఆ మెక్సికన్ కవయిత్రి వాడిన అంతర్గత ప్రతీకల్లోనే. ఆల్చిప్ప, అత్తిపండు, ముఖమల్ వస్త్రం, దూది మబ్బులు, ద్రాక్ష గుజ్జు, నల్లచిరుత, కొమ్ముల దుప్పి, కుందేటిపిల్ల, ముఖంపైని పెదవులు - జననాంగపు పెదవులు.

ఇక్కడి సుజాతా భట్, అక్కడి రోజా మరియా రాఫీల్ ఇద్దరూ లైంగిక వాస్తవాల్ని సాహిత్య వాస్తవ స్థాయికి గొప్ప శిల్పంతో తీసికెళ్ళారు.

కవితా వస్తువులపై భావనా స్వేచ్ఛని పురుషులతో బాటు స్త్రీలు కూడా కోరుకుంటున్నారని చెప్పటానికి ఈ రెండు కవితలు - " చెరుగ్గడ", " ఆరని చిరునవ్వు" ల పూర్తి పాఠాన్ని మీ ముందుంచాను.

సర్రియలిస్ట్ కవులు కూడా భాషకు లైంగికావస్థని ఆపాదించారు. పరాక్రమణంలోని పరాక్రమాన్ని దురాక్రమాన్ని పరిక్రమిస్తూనే ఆదాడిలోని అంత్యస్థితి అయిన నిర్వీర్య నిర్వాణాన్ని నినదించారు. కవిత్వ (లేదా భాషణా) పరిభాషలో దీన్నే 'ఆంటోలాజికల్

ఎపిస్టెమాలజీ' అంటారని విన్నాను. అసలు సర్రియలిజమ్ అనే మాటే ఫ్రెంచ్ భాషలో వ్యాకరణ రీత్యా పురుష నామవాచకమట! అధివాస్తవికత అనేది సామాజిక నీతి నియమాల్ని ఎదిరించే ఒక మానసిక ప్రక్రియ. దాని క్రియాత్మకత ఎట్లాంటి దంటే - నియంత్రిత బాహ్య వాస్తవ చేతననించి స్వప్న సీమల నీలి పర్యావరణంలోకి తేలియాడే చేతనా చేతనావస్థ. ఆ స్థితిలో పదాలే పెదవులు. మాటలే మోహాలు- ఆంద్రీ బ్రీతా లాంటి కవులకు.

దీన్నే textual experience అన్నారు. Texuality నుంచి Sexuality కి రాచమార్గం వేసారు వాళ్ళు.

"Hordes of words, literally unleashed for which Dada and surrealism have engaged to open doors [...] will slowly and deliberately penetrate. The small stupid little towns of literature with sure thrusts [...] They will calmly effect a fair consummation of turrets [...] we pretend not to notice that the logical mechanism of phrases reveals itself to be increasingly impotent, in man's case, to set off the emotive spasm which really makes his life worth while"

(The Surrealist Manifestos - Andre Breton P-32)

క్రీ గీతలు నావి. గమనించి ఆలోచించండి.

ఇందులోని పురుష లైంగికావయవం, అది చేసేపని - పెనిట్రేట్, త్రస్ట్ కన్సమ్మేషన్-స్పాజమ్ అనే పదాలతో పురుష భాషలో వర్ణింపబడింది.

"Woman is both a vassal and vessel in the service of massaging a poetic and linguistic ego" అంటుంది జెన్నిఫర్ పాటర్సన్ ఒక వ్యాసంలో (Textuality and Sexuality - Editors Judith Still & Michael Worton. P-150) ఇంకా అంటూంది. -

"The woman's body is merely a surface on which authors project their own desire. There is no "freedom" for woman, merely a series of imprisoning structures, each built around the other, with the represented and fragmented female body at the centre". అంటూ ఒక స్త్రీవాదిగా తన ఆగ్రహాన్ని ఇంకా ఇలా కొనసాగించింది. " male aggression as love making, many of which I identify with violation and indeed rape, Surrealist images of women are often extremely cruel ...... woman as an object to be flattered, cel-

ebrated, confined, manipulated, disfigured - and finally effaced. (P.152)

మరి phallocratic, patriarchal మగ కవి పుంగవుడు లైంగికేంద్రియ కేంద్రీకృతం ద్వారా తప్పితే మోక్ష మార్గం (gnosis) చేరుకో లేడు! తన ఐంద్రియ ఆందోళనలో కోల్పోయిన తనాన్ని మాత్రమే పొందుతాడు. రేప్‌ని 'స్ప్రెడ్ ఆఫ్ లా' అని, సమర్థించుకొంటాడు పురుష పుంగవుడు!

కొట్టో తిట్టో హేళన చేసో బతిమాలో తన castration భయాన్నుంచి పక్కకి తప్పుకోడానికే పురుష కవి ప్రయత్నమెపుడూనూ. 'Woman was God's second mistake ' అని నేరారోపణ చేసి చేతులు దులుపుకుందామనుకొంటాడు.

యులిసిస్ పెనుయుద్ధాన్నుంచి సజీవుడిగా బయటపడ్డాడుకాని కామమోహినీ దేవత కాలిప్సోనించి బతికి బయట పడటం మరింత కష్టమైపోయింది! ఏడు సంవత్సరాల కాలం పట్టింది. అందరికీ పెనిలోప్ లాంటి వేచియుండే పెళ్ళాలూ, ఆర్గస్ లాంటి కాపలా కుక్కలూ ఉంటారా ఏమిటి అని బైరన్‌లాంటి కవి ( Women In Love ) లో ఆశ్చర్య పడ్డాడు చాలాదీర్ఘంగా.

గెమ్మా డొనాటీని పెళ్ళి చేసుకొని దాంతే మరీ అంత దుర్భర దాంపత్య జీవితాన్నేమీ అనుభవించలేదు గానీ బియాట్రిస్ మీది ప్రేమ వల్లే అంత గొప్ప కావ్యం రాయగలిగాడు కదా! డాన్ ఉవాన్ హైడీని పెళ్ళి చేసుకోక పోటం వల్లనే - "Pillowed upon a fair and happy breast " నిద్రపోగలిగాడు కదా ఊహామాత్రంగానైనా! కీట్స్‌నించి బ్రౌనింగ్ కాపీ కొట్టాడందామా ఇక్కడ! కీట్స్ Last Sonnet లో ~~ఈ~~ పంక్తులు కనిపిస్తున్నాయి. " Pillwed upon my fair love's ripening breast... or else swoon to death " !

పురుష భావజాలంతో లూయీస్, సింప్సన్ ఇలా రాసాడు - ఆత్మసంస్కారం లేని సంస్కార వాదులకో చెంపపెట్టులా -

" The man who married Magdalene
Had not forgiven her.
God might pardon every sin
Love is no Pardoner,

....

It was old harlatory, he guessed

.....

Death granted the divorce

And nakedly the woman leapt

....

The loose behaviour of the bone

And the immodest thigh. "

అసలిదంతా ఎముక చేసిన తప్పా లేక తొడ తప్పిదమెక్కటేనా అని మనం ప్రశ్నించుకోం. పురుషకవులు క్రియాపదాల్నీ నామవాచకాల్నీ ఎక్కువగా వాడుతారు; నిర్భయంగా. కవయిత్రులు - ఎమిలీ డికిన్సన్ లాంటి వాళ్ళు వాటిని సాధ్యమైనంత వరకు వొదిలేస్తారు; భయం, సిగ్గు, సంకోచం వల్ల. ఆభయాన్ని బాగా తగ్గించుకొన్న వాళ్ళు కొందరున్నారు. మేరియానా మూర్, సిల్వియా ప్లాత్, యాన్ సెక్స్టన్, హిల్డాడు లిటిల్ లాంటివాళ్ళు.

హరీన్ ఛట్టో తన "Virgins And Vineyards" గ్రంథంలో అసంతృప్త కామాన్నిలా వర్ణించాడు -

" Secretly hum the hymn of cloven hymen

Clefts in rock and quarry and many-gashed precipice

Wind lashed waters, time split open on calenders

Spilling its virgin state into date divisions;

....

Secretly hum the hymn of cloven hymen

Stain of blood translated to stain of roses. "

పురుషుడికి ( కవి - హరీన్ ) కన్నెపొర ఇంకా చిరగలేదేమని దిగాలయితే రజస్వల అవటం ఎంత చిరాకు పనో లక్ష్మి కన్నన్ ......... Rhythm అనే కవితలో చెప్పింది. (1973 - మిస్‌లెనీ, రైటర్స్ వర్క్‌షాప్ )

" Tugged by occult pulls

the female cyclic secret

Throbs with the star

Wanes and waxes

With lunar gloom

Contracts, releases

energy, fugitive waste

inexorable iambs
beating on muffled drums
in the oyster world
of hushed uterine
within handloom concealments. "

హరీన్ ఒక బాలెడ్ వీధి పాటగాడిలా కన్పిస్తాడు. ముట్టు గదిలో ఋతుమతి అవటం అనే విషయాన్ని ఇంగ్లీషు కవిత్వపు చందస్సు (అయాంబ్) తో సరిపోల్చుతుంది లక్ష్మి కన్నన్.

వృత్తిరీత్యా వైద్యుడైన కవి గీవీ పటేల్ స్త్రీలోని లైంగికతని విధ్వంసపూరితంగా చిత్రించాడు -

" What is it between
A woman's legs draws destruction
To itself ?
Each war sees bayonets
Struck like flags in
A flesh of groin blood
Little bird - mouth
Woman's second,
Secret lip, in - drawn
Before danger, opened
At night to her lover.
...
thigh meets belly; target spot
Showered.
With kisses, knives, " ( The Logic )

[ అనాటమీ ఈజ్ డెస్టినీ అన్నవాడెవడో వాడికి జోహార్లు ! ]

కవులు ప్రతీకలు వాడతారు; స్త్రీలైనా పురుషకవులైనా. ఆ ప్రతీకల్ని రూపాన్నించి శబ్దానికీ శబ్దాన్నించి రంగుకీ, రంగునించి వాసనకీ, వాసన నించి స్పృహకీ స్పృహనించి రుచికీ, అనుభూతి నుంచి అనుభవానికీ మారుస్తుంటారు.

కె.ఎస్. దారువాలా(IPS) తన ప్రతీకల్తో కొంచెం హాస్యం కూడ ఒలకబోస్తాడు - దొంగను పట్టుకొన్న పోలీసులా,

" the thieves had only one country - made pistol looking for all the world
like a crooked man-made penis that could not rise to the occasion. " ( డెత్ బై బరియల్ )

సామాజికంగా, కౌంటుంబికంగా, ఆర్థికంగా, విధాన విషయంగా, లైంగికంగా ఎన్నో అణచి వేతలున్నై. ఆ అణచివేతలన్నీ ఆ రిప్రెషన్స్ అన్నీ, ఆ రిగ్రెషన్స్ అన్నీ కవిత్వంలో ఫాంటసీస్‌గా, మిత్స్‌గా, సింబల్స్‌గా ప్లెజర్ ప్రిన్సిపుల్‌తో పైకితేలతయ్, కవులు - స్త్రీలైనా పురుషులైనా అలా సబ్లిమేషన్ కి లోనవుతారు. ఆదివారం ఆనందవారం. అది శనివారం రాత్రినించి మెదలయ్యే జ్వరం. లోజెరమో ప్లెజరమో కొల్చేది - ఉదయం కన్నెస్ అంటూ చేస్తే కదా!

సబ్లిమేషన్ లోంచి స్వప్నంలోకి - స్వప్నంలోంచి తిరిగొచ్చి తండ్రి (సమాజం) తల్లి (సంస్కారం) లోకి తిరిగొచ్చి చచ్చినట్టు ఇలానే అంటాడు కవి - (కవిత్వం రాసే పురుషుడుగానీ స్త్రీగానీ మానసికవ్యాధులున్న వైద్యుల వద్దకు వెళ్ళక్కరలేదు!)

More admirable than a familiar breast.

A foreign sex she is

....

And retrieve my origin

In that unfamiliar breast

In that more admirable breast, to rest. " (సురేష్ కోహ్లి)

చివరికి తల్లి వక్షంతో గాని తనివి తీరదీ కవికి. దీన్నే trans substantiaon of pleasure అంటారు.

పద్మాక్షీనుడైన బుద్ధుడ్ని ప్రియుడిగా పలకరించగలదు సరోజినీ నాయిడు; గౌతముడ్ని మిస్టర్ గౌతమ్ అనీ పిలవగలదు కమలాదాస్; ఇద్దరూ ఈ ప్లెజర్ ప్రిన్సిపుల్ ద్వారానే, ఆదివారం సెలవురోజుకదా, ఆదివారం ఆటపాటలే కదా, అందుకనే అంటుంది మమతా కలియా

" I want to pay sunday visits

totally undressed

(Compulsions అనే కవితలో)

చర్చ్‌కి అలానేనా వెళ్ళేదని కవయిత్రిని కోప్పడి ఏంలాభం?

రాబర్ట్ ఫ్రాస్ట్ మీద చచ్చే కోపం ఈవిడకి, అందుకనే పెద్దమనిషీ చెప్పొచ్చావులేవోయ్ అన్నట్లు -

" I haven't even seen an apple for many months

Whatever we save we keep for beer

And contraceptrives " ఒక చురక వేస్తుంది.

క్వీన్ ఎలిజిబెత్ ది ఫస్ట్ కూడ ఓ అరడజను ప్రేమ కవితలు కోసిందట ఓ అద్దపు కిటికీ పైన తన రత్న ఖచిత ఖడ్గ కలంతో, అదొక రాణి ప్రేమపురాణం! అవునూ ఖడ్గ మృగాల ప్రేమాశ్వాసాలెలా ఉంటాయో ఎవరన్నా ఊహిస్తే బావుంటుంది కదా! ఒక రైనో పెళ్ళి చేసుకొంటుంటే ఆపెళ్ళికి ఆహ్వానం వస్తే, మాత్యూ ఆర్నాల్డ్ కూడా Forsaken Mermon రాయకపోను. హిప్పోముందు కూచుని అలా Dover Beach లోలా ఏడవకపోను! సరే! Dover Beach కవితలో ఉన్నదంతా trans substantiation అంటే కాదంటారా?

## II

మళ్ళీ మొదటికే వద్దాం. ఆంద్రీ బ్రీతా భార్య సుజాన్ ముజార్డ్. ఆమె దేహాన్ని తన ఆస్థి గానే వర్ణించాడు బ్రీతా. నా స్త్రీ / నా భార్య అంటూ ముక్కలు ముక్కలుగా కోసి మరీ వర్ణించాడు. ఆవిడకంటూ ఒక ప్రత్యేక స్థానము, స్థితీ గతీ ఏమీ లేదు. అధివాస్తవిక నైరూప్య చిత్రాలలో, సర్కార్ మాజిక్ లాగానే దేహం ఖండ ఖండాలుగా కోయబడుతుంది. కాని నెప్పి ఉండదు. నవ్వులే నవ్వులు.

అలాగే పురుషకవిన్నూ తనని తాను ఖండ ఖండాలుగా కోసుకోగలడు. భర్త/తండ్రి/ప్రియుడు/ఉద్యోగి/సంస్కర్త/కవి/ఉద్యమకారుడు/నిర్లిప్తుడు/వినిమయుడు/బాధితుడు/కాపిటలిస్ట్/కమ్యూనిస్ట్/కెరీరిస్ట్/సోషలిస్ట్/కొడుకు తండ్రి/కూతురి తండ్రి/లంచగొండి/యాక్టివిస్ట్/మగ ఫెమినిస్ట్/మాసొకిస్ట్/సాడిస్ట్/సినర్/సెంట్/క్రైస్ట్ ల్లాగా; తన కవిత్వంలో కావాలనే ఒక గొప్ప exegi monumentum (మహా వాఖ్యానం) ని సృష్టిస్తో. ఇదంతా చేయాలంటే ముందు కవి అన్న వాడు నేను ఒక్కడ్ని కాదు; నేనంటే రెండు ముఖాలు అని కన్ఫెస్ చేయాలి. అలాంటివాడిని మనం మూడు ముఖాల్తో చూడాలి కాపలా కాస్తూ జేనస్‌లాగా.

ఇన్నాళ్ళుగా పురుషుడికి జెండర్ బెండింగ్ (లైంగిక ఆధిపత్యం) సాధ్యపడింది. ఇక అది సాధ్యమయ్యే విషయంగా కనపడనపుడు ఉన్న ఒకే ఒక దారి జెండర్ బ్లెండింగ్. మిశ్రీకరణ ద్వారా, శాస్త్ర విజ్ఞానం ద్వారా, పారిశ్రామికరణంద్వారా, సాంఘిక ఆర్థిక

స్థితిగతులలోని అనూహ్యామైన పరిణామాల ద్వారా, ఇతర దేశాల సంస్కృతి నాగరికతల వెల్లువల విలువల ద్వారా మార్పు తప్పని సరైంది. సాంఘిక శాస్త్రాలు సాహిత్య సిద్ధాంతాలని ప్రశ్నించటటం మొదలు పెట్టాయి. రాజకీయ శాస్త్రాలు కౌటుంబిక జీవనాల లోని అంతస్సారాన్ని ప్రశ్నించినయ్. వ్యక్తిగతం కూడా రాజకీయమే నన్నారు. దేశీయమూ ప్రాంతీయమూ అనే కొత్త ఎల్లలు నిర్వచించబడినయ్. లైంగికత్వపు ఆవరణలు బాహ్యంగానూ ఆంతరంగికంగానూ వాటి వాటి అస్తిత్వాలతో ధైర్యంగా నిలబడినయ్. జుట్టు (స్త్రీలకు) ఎంత పొడవుగా ఉంటే ఆలోచన అంతకురచ అనీ, వాదించే స్త్రీలకు గడ్డాలు మొలుస్తాయనే భావన (కాంట్) ఇవ్వాళ నవ్వు తెప్పిస్తుంది.

స్త్రీవాదం విస్తృతంగా వాడుకలోకి వచ్చి -లోపల-బయట, వక్తిగతం- సామాజికం అనే వాటిని పునర్నిర్వచించింది. Sexual Politics అనే నూత్న పద బంధాన్నిచ్చింది. (కేట్‌మిల్లెట్) కుటుంబం, లైంగికత, కుటుంబదాస్యం, కుటుంబ జీవితంలో పని విభజన, పిల్లల పెంపకం, సంతాన నియంత్రణ, అవివాహ జీవితంలో ప్రణయం, శృంగారం, ప్రేమ, సహచరత్వం లాంటి కొత్త ప్రశ్నల్ని లేవనెత్తింది.

" In the origin of every nation we find the story of the nation's origin " (Geoffrey Bennington) అన్న వాక్యం విరోధాబాసంలాగా వినిపించవచ్చు గానీ సత్యమే. అనేక రామాయణాలలో మనం ఏ రామాయణాన్ని చదువుతామో ఆ రామాయణాన్ని బట్టే ఏకపత్నీ వ్రతం ఏక సతీవ్రతాలు ఆధారపడతాయి. సంస్కృతి, సాహిత్యాలు ప్రాదేశికాలే కాని సర్వకాలీనాలూ సర్వ దేశీయాలూ కావు.

## III

'భావకవినికాను నేనహం భావ కవి' నన్న పఠాభిని మరే తెలుగు కవీ అందుకో లేక పోయాడు. రాముడి కంటే రావణాసురుడిగానే ఉండటంలో ఉన్న సదుపాయాలన్నీ ఆయన విశదీకరించాడు. పఠాభి poem 'సీత' చదవండి :

### సీత

సీత నా సహాధ్యాయిని, సీతా నేను గలసి
నవీనమగు విశ్వనాధ సత్యనారాయణ కృత
రామాయణ మహాకావ్యమును
పఠించినాము, -
పఠన ముగిసిన తర్వాత
సీత వంకజూచి, సీత ఆలోచన లోచనాల
వంకజూచి, ప్రశ్నించా ఈలాగా!

"రామాయణాన్నంతా విన్నావు గదా,
ఆదర్శపురుషుం డనబడు పురాణయుగం
నాటి రామయ్యతో
కవన జవ గమనుల మయి,
భూతకాల కాలాటవిలోకి జొచ్చుకొనిపోయి
కలిశాము గద, అతన్ని
అనుసరించి అడవికి పోయాము,

మరుగుననుండి వాలిని పరిమార్చుట జూచినాము,
తన సతిని అగ్నిపరీక్ష చేయటం చూచినాము,
ఇదంతా చూచాక,
"సీతా! నువు పురాణ యుగంనాటి
రామయ్య సతి సీతలాగా
వుండాలని వాంఛిస్తావా? చెప్మా!"
ఇటుల నేను వచించటము విని
అనింది :
"పఠాభీ! పతివ్రతా శిరోమణి సీత,
భారతీయ స్త్రీమూర్తి సీత,
అట్టి సీతగావుండే భాగ్యం
అది అందరాని అపూర్వ మహాభాగ్యం కదా!
కానీ, సీతగ వుంటానికి నేను
కోరినా రామయ్య సతిగావుంటానికి మాత్రం
ఒప్పుకోను ఏమాత్రం నేను"
-"బలేమాట అన్నావు, సీత, బలే,"-
"రామయ్య సతిగానుంట కన్న
రావణుని ప్రియురాలిగా వుండి
హృదయం గల అసురుణ్ణి అమరుణ్ణిగా
చేసివుండేదానిని నాప్రేమ బలంతో; -
అదిసరే, పఠాభి! నీ కేమన్నా
రామయ్యగా వుండాలని కోరికవుందా?"
"ఆ! ఏమ్మాటన్నావు, సీతా!
నీకు రామయ్య సతిగావుంట ఇచ్ఛ లేకున్న
నాకు మటుకు
రామయ్యగా వుంటకు ఎలా యిష్టం వుంటుంది?
రామయ్యగావుండే దానికంటే
రావణుని గావాలని నా వాంఛ -
పది మూతులతోను, నీ పెదవులను
మృదు శరీరమును, వదనమును అదుముతాను,
ఇరవయి కళ్ల సంకెళ్లతో నిన్ను
నిరతము బందీ చేస్తాను,
ఇరవయి లావు చేతుల్లో నిన్ను
నా పక్షానికి లాగు కొని
చిక్కని కవుంగిలింతలో
అయిక్యం చేసుకుంటాను నిను, నాలో, సీతా?"
సీత నా సహధర్మచారిణి
ఇప్పుడు.

కాని తర్వాత ఏ తెలుగు కవీ అతని వ్యంగ్యాన్ని అందుకో లేక పోయాడు. అన్ని రకాల నవ్య సాహిత్య పరిషత్తులూ, రచయితల సంఘాలు, అరసాలు, విరసాలు, దిగంబరోద్యమాలూ కవిని సమాజానికి సబ్జుగేట్ చేయటానికే ప్రయత్నించినయ్ గానీ, నోరు నొక్కేసినయ్ గానీ, సమాజానికి సాంఘిక సంక్షేమానికి అనుబంధంగా ఉండమని తొక్కిపెట్టినయ్‌గానీ స్వతింత్రించి ఒక్కమాటనూ చెప్పనివ్వలేదు.

పఠాభి భావకవిత్వంపై చేసిన తిరుగుబాటు ఫలించలేదు. నగరజీవన చిత్రణ చేయబోయిన నారాయణ బాబు కూడ అభ్యుదయ కవిత్వం విసిరిన వలలో చిక్కుకుపోయాడు. శిష్ట్లా, అజంతాలు అరాచక వాదపు అడుగులు చూచారు కాని పైకి తేలి చెప్పింది చాల తక్కువ . కథల్లో, అనువాద కవితల్లో అసలైన ఆధునికతలు చెప్పబోయిన శ్రీశ్రీని ఎప్పటికప్పుడు సాహిత్య సంఘాలూ సంస్థలూ హైజాక్ చేసినాయ్. కుందుర్తి 'నగరంలో వాన' లో 'మితిమీరిన' సరళత వల్ల అది కవిత్వ స్థాయికి ఎదగలేదు. 'తిలక్' తనను గురించి తాను చెప్పుకొన్నదేమీ లేదు. 'సినీ వాలి' ఒక్కటే నగర జీవితంలోని

సంక్షోభాన్ని వ్యక్తిలోని సంక్లిష్టాన్ని పట్టుకోగలిగింది. 'బైరాగి' లోని ఆంతరంగిక వేదన సందిగ్ధ స్థితి ఆయనని ఒక ఏకాకి కవిని చేసినయ్.

తెలుగులో ఉన్న ఒకే ఒక కన్ఫెషనల్ పొయెట్ శ్రీశ్రీ. ఒకే ఒక కన్ఫెషనల్ రచయిత, ఆలోచనా శీలి 'చలం'. ఒకే ఒక నాన్ కన్ఫెషనల్ మాయాజాల కవి కృష్ణ శాస్త్రి.

సమ సమాజం ఒక అభూత కల్పన అవుతున్నపుడు కవులు సహజంగానే అసంతృప్తులవుతారు. అంతర్ముఖులవుతారు. స్వీయ సత్యాల్ని బహిరంగ పరచే సాహిత్యాన్ని సృష్టిస్తారు. బీట్ కవులు-వాళ్ళలాంటివాళ్ళు వారి వారి భాషల్లో పుట్టుకొస్తారు. పురుషులలోనే కాక మహిళలలోనూ ఆంతర్య సత్యాల్ని వెలువరించే కవులు ముందుకొస్తారు ('చెరుగ్గడ' 'ఆరని చిరునవ్వు' దానికి సాక్ష్యాలు)

స్త్రీ అస్మిత అవుతుంది. హృదయానికి ఒక బహువచన నిర్వచనాన్నిస్తుంది. పురుష స్పర్శానురాగాన్ని సంకోచరహితంగా ఆలపిస్తుంది. తన శరీరంతోనే ప్రపంచంలోకి చొచ్చుకుపోయే అద్వైత స్థితినందుకొంటుంది. రజస్వలా రహస్త్రంత్రిని మీటుకొంటుంది. నెలనెలా పునర్జన్మనెత్తుతుంది. సౌందర్యాత్మకహింసను భరించలేక అందవిహీనతనే ఆదరిస్తుంది. నిలువెత్తు నిస్సిగ్గుకి నిర్వచనమౌతుంది. మార్జాల దాంపత్యాలకు వీడ్కోలు పలుకుతుంది. " కామ మోక్ష మోక్షకామ అశాంతుల/అగ్నిగోళ/మహారణ్యాల కాంక్షా సౌందర్య తాండవ కీలల్లో/ దగ్ధమై ప్రభవించి ప్రభవించి దగ్ధమై/ రమిస్తే శమిస్తే ధమిస్తే శాంతి శాంతి శాంతి" అని అనురాగ దగ్ధదేహ సమాధిలోంచి నిర్భయంగా నిశ్చయంగా ప్రకటిస్తుంది, అవివాహ సత్తాకీ వివాహ అతి తృప్తికీ (satiation) మధ్య యుద్ధాన్ని భరించలేక అసలు ఆ అవయవాన్నే విసిరవతల పారేస్తే చాలంటుంది. సర్ప పరిష్వంగాన్నించి తనని తాను విసిరి కొట్టుకొంటుంది. అసలు బందిపోటు ఎవరో తెలుసుకొంటుంది, 'నిరీక్షణ' ల ఆధునిక మూలాల్ని ప్రశ్నిస్తుంది. తండ్రి, మొగుడు, కొడుకుల మర్రి చెట్టునీడల క్రింద ఇక బ్రతకనంటుంది పైటను తగలేస్తానంటుంది. వంటింటిని తగలేస్తానంటుంది. పాలింకిపోటానికున్నట్లు మనసింకిపోవడానికి మాత్రలుంటే బావుండునని వెదుక్కొంటుంది. లక్ష్మణ రేఖల్ని అత్యవసరంగా దాటేస్తానని నిర్ణయించుకొంటుంది. కడుపు చేసినవాడ్ని కత్తితో కుమ్ముతానంటుంది. మగ మృగాల్ని వాళ్ళ వాళ్ళ భార్యల ఒళ్ళో చావండని ఆగ్రహంగా శపిస్తుంది. నగలు పెట్టుకొని నవ్వుతూనే నడిచే గాయాల్ని పట్టి చూపిస్తుంది. నిషిద్ధఫలం కుట్రని ఎలుగెత్తి చాటుతుంది.

స్త్రీవాదంలో దీన్ని ప్రొటెస్ట్ కవితగా సులభంగానే గుర్తించారందరూ. అయితే అసమ్మతిని నిర్భయంగా చెప్పడానికి ఎంతైనా కొంత సొంత గొంతు, స్వీయ జీవిత

పూర్వ రంగం ఉండాలి. అరువు తెచ్చుకొన్న గొంతుల్తో ఏ సత్యాన్నీ చెప్పలేం.

అధివాస్తవిక కవిత కూడ అసమ్మతి కవితే, ఇతరులకు సమ్మతం కాని విషయాన్ని కవిత్వ రూపంలో అనుభవ ప్రాతిపదికగా కన్వెస్ చేస్తూ చెప్తున్నాడంటే దానికీ ఒక సాహిత్య విలువ ఉండటం వల్లనే.

" The main themes of surrealist poetry are love, revolt, the marvellous, freedom, the exaltation of desire, "black humour" and the universe of subconscious thought. the love of woman, of a frankly erotic character, is considered a form of liberation. Revolt for the surrealists, is directed principally against logic, social morality and conventional norms. These they would replace by an unconditional pursuit of the marvellous in every day life, especially as it manifests itself in urban civilization. " Black humour is also an expression of revolt in that it is characterized by an explosive and liberating effect. The exaltation of desire is upheld because of a belief in the ultimate worth of all passions. "

( Princeton Encyclopedia of Poetry & Poetics )

నేను క్రీగీతలు గీచిన పదాలలోని ప్రాధాన్యాన్ని గమనించి వాటి నించి వచ్చే భావజాలాన్ని కన్వెషనల్ కవిత్వానికి అనుసంధానం చేస్తే సమాజంలోని వ్యక్తి యొక్క స్వస్వరూప చిత్రణ విశదమవుతుంది.

1955-60 మధ్యకాలంలో వచ్చిన బీట్ కవులను 1950లలో వచ్చిన యాంగ్రీ యంగ్ రచయితలను ఈ పద్ధతిలో అర్థం చేసుకోవాలి. వాళ్ళందరూ బుద్ధివాదానికి వ్యతిరేకులు. శుద్ధ శూన్యవాదులు. జీవితంతో ఆటలాడుకొన్న వాళ్ళు. మాదక ద్రవ్యాల్ని సేవించిన వాళ్ళు, రాజకీయాలకి వ్యతిరేకులైన అరాచక వాదులు. విట్‌మన్ వాళ్ళకు ఆదిగురువు. కార్సో అమెరికాలో మళ్ళీ సింబలిజమ్‌ని జాగ్రత్తగా ప్రవేశపెట్తే కవిత్వాన్ని జాక్ కెరొక్ స్వయంచాలకం చేస్తే, గిన్స్ బెర్గ్ అమెరికాకు ఒకానొక ప్రాక్‌చేతనని కలిగిస్తే, ఫెర్లెంగెట్టీ డాడాయిజమ్‌ని మళ్ళీ పట్టిలాక్కొచ్చాడు. శాన్‌ఫ్రాన్సిస్కో ని జుట్టుపట్టుకుని బెర్లిన్, పారిస్, కోపెన్ హాగెన్ దాకా లాక్కెళ్ళాడు.

సరిగ్గా ఇదే సమయంలో తెలుగు కవిత్వంకూడా కొంత తెలుగు మీరింది. 1980లకి ఉద్యమాల ఉధృతి తగ్గినాక తెలివి మీరింది. 1985 కల్లా స్త్రీవాద కవిత్వం రూపు దిద్దుకోవటం మొదలు పెట్టింది. కానీ అదంతా నగర జీవన మధ్యతరగతి మహిళల జీవిత

సమస్యలలోంచి వచ్చిందే.

స్త్రీ పురుషసంబంధాల గురించి కవులు కవిత్వంలో చెప్పుకోవాల్సి వచ్చినపుడు పురుషుడే ముందుగా తన అనుభవాల్ని గర్వంగా చెప్పుకొస్తాడు. (యూలిసిస్, పెనిలోప్ శయ్యలో ఉండి ఆ సంబంధాల్ని చెప్పుకొన్న సమయంలో మాత్రం పెనిలోప్ ముందుగా తన పవిత్రతను ఎలా కాపాడుకొన్నది చెప్తుంది. !) దానికి కారణం పురుషాధిక్యతే. పితృస్వామ్య వ్యవస్థే, పశ్చిమ దేశాలలో ఇపుడు స్త్రీయే ముందుగా తన గాధల్ని గర్వంగా చెప్పుకొస్తుంది. బర్డన్ ఆఫ్ ది వైట్‌మాన్ లాగా బర్డన్ ఆఫ్‌ది ఉమన్ ని ఎంత మోసాడో అని చెప్పి చూపించే ఎగ్జిబిషనిజమే కారణం.

ఒక వ్యక్తి ఏ నటనా (hypocrisy) లేని స్వీయానుభవ స్త్రీ సంబంధాల్ని మాత్రమే రాస్తున్నా నన్నప్పటికీ నిజానికి అవి ఆ ఒక్క వ్యక్తికి మాత్రమే బంధితమైనవి కావు. ఒక రచనని మనం పాఠకుడిగ చదువుతూన్నపుడు కూడ ---- ఆ రచన ఆ రచనకు మాత్రమే - ఆ ఒక్క పాఠకుడికి మాత్రమే - నిర్బంధితం కాదన్న మాటే. 'రచన' లో 'రచనలు' ఉంటాయి. పాఠకుడిలో పాఠకులు ఉంటారు. దీనికే - ఎప్పటికపుడు బహుళమైన ప్రతి స్పందనలని రేపే 'రచన' లోనే ఆంతరిక రచన ఉంటుందని జూలియా క్రిస్టీవా inter textuality అని ఒక పేరు పెట్టింది.

" We reject essentialism, be it of text, art or woman / man. Texts like individual women and men, are socially constructed, whatever may be their features of specific individuality.

Subjects decipher the world, social situations, themselves, as well as texts in the narrow sense. Simultaneously these interpreting individuals, in making sense of the material which surrounds them, write plots for themselves to figure in, and script for themselves and then others as characters in the scenario .....

A woman always is and is not a woman, a man always is and not a man, the biological, the social and the aesthetic are constantly interfering with the identity the subject may wish to establish." ( Judith Still & Michael Worton in Textuality & Sexuality pp 5-7 )

అందుచేత కవిత్వంలో లైంగికత ద్వారా కూడా సామాజిక పరిణామాలనీ, వ్యవస్థలోని చట్రాలనీ, నీతులనీ నియమాలనీ, నిషిద్ధాలనీ వాటిని వ్యత్యస్థం చేసే వ్యక్తుల

ప్రయత్నాలనీ ఆ ప్రయత్నాలని మళ్ళీ ప్రతిఘటించే సంస్థీకరణనీ స్పష్టంగా అర్థం చేసుకొనే అవకాశం కలుగుతుంది.

లైంగికానుభవాన్ని పురుషకవి అయితే లిబర్టైన్ శైలిలో రాస్తాడు. అది అతని శైలీ విశేషణం తప్పితే సారంలో స్త్రీ స్వీయానుభవ వ్యక్తీకరణ దానికి విరుద్ధం కాదు.

## IV

Author ఎవరు? Writer అని ఎవర్ని అంటాం? మూలభావజాలాన్ని మౌలికమైన సిద్ధాంత సంధాని జీవితానికి సూత్ర బద్ధం చేసే ప్రేరకుడిని author అనొచ్చు. ఆ సూత్ర జాలాన్ని ప్రక్రియ బద్ధం చేసి రచన చేసేవాడు writer . రూసో తన కన్ఫెషన్స్ రాసినప్పటికీ అతను రచయిత కాదు. సూత్రకర్తే. (Author) రచయిత నుంచి (రచయిత్రులనించి) మనం ఇంకా ఎక్కువ ఆశిస్తాం. కవులనుంచి (కవయిత్రులనించి) కళాకారుల నుంచి మరింత ఎక్కువ ఆశిస్తాం.

ఈ ఆశించటం ఎక్కువ అయినపుడు కవి ఒక అనుభవాన్ని అందరి పరం చేయాలనే తపనతో ఫస్ట్ పర్సన్ సింగ్యులర్‌లోకి రూపాంతరం చెందుతాడు. లైంగిక సంబంధాల భావజాలానికి ఒక నాటకీయతను కల్పిస్తాడు.

పసుపులేటి పూర్ణచంద్రరావు గారి కవితల్ని ఈ కోణాన్నించి కూడ చదువుకోవచ్చు.

ఆధునిక కవిత్వం ఒక్క సాహిత్య ప్రక్రియ మాత్రమే కాదు. దానిమీద ఎన్నో అనుబంధ కళల ప్రభావం గాఢంగా ప్రతి ఫలిస్తుంది. చిత్రకళ, శిల్పం, గానం, నృత్యం, చివరికి సినిమా కళక్కూడ దానితో ప్రమేయముంటుంది.

పసుపులేటి పూర్ణచంద్రరావుగారి కవితల్ని ఒట్టి పచ్చి వాస్తవాల చిట్టాగా భ్రమించే ప్రమాదాన్నించి ఈ అనుబంధ కళలే - సంగీతం, శిల్పం, సాహిత్యం, యోగా, తంత్ర, సినిమా, రహస్య పోరాట సిద్ధాంత జీవనాలూ - రక్షించినయ్. అందుచేతనే ఈ కవితలకి మూలాలేమిటో తెలిపే యానోటేషన్స్, టీకా తాత్పర్యాలు అపుడపుడు అవసరమవుతుంటై.

ఎలియట్‌రాసిన "లౌ సాంగ్ ఆఫ్ ఆల్ఫ్రెడ్ జె. ప్రూఫ్రాక్" అర్థం చేసుకోకుండా మనం ఏ ఆధునిక కన్ఫెషల్ కవినీ అర్థం చేసుకోలేం. పసుపులేటిలో ప్రూఫ్రాక్ ఎక్కడెక్కడ ఉన్నాడో జాగ్రత్తగా కనిపెట్టూ ఉండాలి. అదొక్కటే కాదు. మనలోనూ ప్రూఫ్రాక్ ఎప్పుడెప్పుడు ఉంటున్నాడో అని కూడా కొంత గూఢచర్యం చేసుకుంటూ ఉండాలి. ఇక నుంచి ఆ టీకా టిప్పణి సంగతి కొంచెం చూద్దాం -

కవిత 'అగ్గిపుల్ల - పిచ్చిపిల్ల' :

మంచుకొండ (P. 13)= అనాసక్తత

నాముఖానికి వేలాడ గట్టిందో సిగ్గుబిళ్ళ (P. 13)= లైంగిక గాయం.

స్కార్లెట్ లెటర్‌లాంటి చెరుపుకోలేని 'A' అనే అక్షరం.

'మగ మీమాంస' : (P. 15)

"నాకిద్దరూ కావాలి... అంది" ఇదొక రకమైన సాంఖ్య సిద్ధాంతంలా కన్పించటం లేదూ! మాటర్, కాన్షస్‌నెస్ రెండిటిలో దేన్నీ ఒదులుకోలేని తనం.

'పెళ్ళి ... గిళ్లి' (P. 19) షోపేన్ (Fryderyk Chapin) Sonata No. II లో 'ఫ్యూనరల్ మార్చ్' అన్న భాగం. మధురమైన శోక గీతం.

ఈ కవితల్లోని 'కన్నమ్మ' ఒక్కోసారి నిజమైన స్త్రీ. ఒక్కోసారి కేవలం ఒక కాన్సెప్ట్ మాత్రమే. "పియానో పగలగానే పెళ్ళి పందిరి కనబడుతోంది కదూ!"

'పందిట్లో పెళ్ళవుతున్నదీ' పాట గుర్తుకు రావటం లేదూ? గోరింటాకు కోయగబోతే ... లాగా !

'మీటూ ఏ బల్తజార్' (P. 37) Robert Bresson సినిమా "Au Hasard Balthazar" లో కథానాయకుడు ఓ గాడిద. అయ్యో పాపం అనిపించే గాడిద. అతను జీసస్ క్రైస్ట్ అంత గొప్ప ప్రాణి ...

'సౌందర్యం కోసం' (P. 21) 'జన్మ జన్మల బంధం', 'ప్లెటానిక్ లౌ' లాంటి పదబంధాలు కవికి చాల కృతకంగానూ వికృతంగానూ కన్పిస్తున్నాయి. ఏనాటి పతాభి!

'మానుషి - మాస్క్' (P. 23) ఈ కవితలోని స్త్రీకి జీవనానంద క్షణాలు సంగీతాన్నించి మాత్రమే లభ్యం - బడేగులామ్, అమీనుద్దీన్, రవిశంకర్, పర్వీన్ సుల్తానాల వల్ల. మూడు పెగ్గుల ఆల్కహాల్ వల్ల కూడ!

'మాయాదర్పణం' (P. 29) Dali చిత్రించిన Metamorphosis of Narcissus ప్రేరణ.

రాబర్ట్ డినీరో నటుడు.

"నా కన్నుల్లోంచి కారే చీమల్నేం చేయను?" = ఈ పదచిత్రంకి మూలం ఓ సినిమా. Luis Bunuel తీసిన "Un chien Andalou"

'ప్రతిపాదం పరమ పంకిల ‹ వేకదా ...!' (P. 35)

Kelly McGellies హాలీవుడ్ నటి.

'నా ముంబాయీ బాయీ!' (P. 40)

'బ్రాట్ ట్రిలజీ - కవితాత్రయం లోని మొదటిది. ఇందులో కనబడే ముగ్గురు బ్రాట్స్ అవివాహిత స్త్రీల పుత్రరత్నాలు. ముగ్గురూకాపలా కాసే స్పింక్స్‌లే. గుమ్మం ముందు

కాపలా. మానసికంగా ఈ పిల్లలు చాల సంక్లిష్టులుగా పెరుగుతుంటారు. తల్లుల కాంప్లెక్స్‌లు వీళ్ళకు సంక్రమించాయి. తల్లులు లైంగిక బంధాలలో to be or not to be అని కొట్టుమిట్టాడుతుంటారు. వీళ్ళ private space పై కవికి గొప్ప గౌరవ భావం. ఎంత గొప్ప ఫెమినిస్ట్‌కయినా ముంబాయి బాయిలా సినికల్‌గా ఉంటూ డెలిబరేట్ డెవిల్‌గా, బొహీమియన్ స్టైల్‌లో బ్రతికెయ్యటం అంత సులువు కాదని కవిలో ఓ చిన్న జాలి, ఆదరణ భావం.

'బ్రాట్ ట్రిలోజీ నెం. 2' (P. 42) ఇది బెర్గ్‌మన్ సినిమా 'సైలెన్స్' మీద ఒక సమీక్ష లాంటి కవిత. ఇద్దరు ముగ్గురు పాత్రల్ని అతిచిన్న స్పేస్‌లోకి కుదించి వాళ్ళ అంతరంగ కల్లోలాల్ని Chamber Cinema గా తీసిన కళాత్మక సినిమా 'సైలెన్స్'. అక్క లెస్బియన్. చెల్లెలు ఆమె మీద ఆధారపడాల్సిన స్థితి. కొడుకు ఇంగ్రిడ్ ఒక మిస్టీరియస్ కారక్టర్. వాడిదొక సొంత ప్రపంచం. ఓ మరుగుజ్జు మ్యూజీషన్ల గుంపు. ఓ ముసలి హోటల్ అటెండర్ ఈ కుర్రాడి సహచరులు. హోటల్లో కస్టమర్లెవరూ కనపడరు.

నిశ్శబ్దాన్ని అపుడపుడు ఛేదిస్తూ బాఖ్ సంగీత ఛాయలు. సంగీతంలోనూ మొనాటనీయే విన్పిస్తుంది.

'స్పింక్స్' (P. 45) 'బ్రాట్స్ ట్రిలజీ' లో మూడో కవిత. మూడు కవితల్లోని motifs ఇక్కడ Juxtapose అవుతాయి ఈ మూడో కుర్రాడు భయంకర జంతువులాంటివాడు. నిజమైన స్పింక్స్ కాబట్టే కవితకూడ ఓ రిడిల్‌తో ముగుస్తుంది.

'కుయ్ ...! కుయ్' (P. 84)

ఫ్రాగోనా = Fragonard's Painting " The Bolt " చాల చిన్న పెయింటింగ్. పారిస్‌లోని Louvre లో ఉంది. 18వ శతాబ్దపు చివరిలోది.

ఇసాక్ స్టెర్న్ గొప్ప వయోలిన్ విద్వాంసుడు. సంగీతంలో కూడ Sexual rush.

తెల్ల బాలభానుడు కవికి రైవల్. జర్మనీ నించి దిగి వచ్చాడు. ఆ నెరజాణ ఇద్దరినీ సమర్ధించుకు రాగలదు!

'అసంపూర్ణ గీతవే కానీ ...!' (P. 69) Franz Schubest's incomplete 8th Symphony ప్రేరణ.

'క్షతగాత్ర సమాధానం' (P.114)

మాతృస్వామ్య వ్యవస్థలో స్త్రీలదే రాజ్యం. వాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకోరు. వాళ్ళ షరతులమీదే నచ్చిన పురుషులతో సంబంధాలు. సంతానం కేవలం స్త్రీధనమే. పురుషులు పరస్పర శత్రువులుగా మారరు.

'ఛిన మస్తాదేవి' (P. 66)

ఛిన్నమైన మస్థకం గల దేవత. బుద్దిస్ట్‌తంత్రం. తల చీలిపోయి ఉండటం, లేదా తల లేని మొండెం నుంచి నెత్తుటి ధారలు పైకెగజిమ్ముతూండటమో ఈ ఐక్నాగ్రఫీ లక్షణాలు.

జర్మేన్‌గేర్, మరియా మిస్ - ఇద్దరూ స్త్రీవాదులు.

Fassbinder సినిమా ' The Marriage of Maria Baun ' లోని మోటిఫ్ ఉదాహృతం.

కన్మమ్మ - కవితలన్నిటా అంతర్లీనంగా కన్పించే రికరింగ్ వ్యక్తి, ఒక మోటిఫ్.

'ఒంచటానికి ...!' (P. 138)

ఈ కవితలోని ఇతి వృత్తాన్ని పెంచి " The Lotus and the Moon" అని ఒక ఇంగ్లీషు నాటకం రాశారు కవి పసుపులేటి.

"జొకాస్టా'తీతం' (P. 88)

ఎల్లమ్మ ఓ మాతృదేవత." Ellamma " అనే పూర్తిస్థాయి నాటకాన్ని పసుపులేటి రచించారు.

స్త్రీ స్వామ్య దేవతలకు వావి వరుసలుండవని పురుషస్వామ్యం అంటుంది.

జొకాస్టా స్త్రీ స్వామ్య పాత్రకాదు. గ్రీక్ పురుషస్వామ్యంలో పొరపాటున (గ్రహపాటునో!) కొడుకు ఇడిపస్‌తో లైంగిక సంబంధం పెట్టుకొని ఆ నిజం తెలిసాక ఇరువురూ గిల్ట్‌తో నలిగి చచ్చిపోతారు. ఇద్దరూ ఇన్‌సెస్ట్‌కి బలయిపోతారు.

ఎల్లమ్మ కథలో incest తప్పుకానే కాదు; అది సృష్ట్యాది నాటి కధ కనుక; ప్రపంచంలోని స్త్రీ దేవతలందరూ ముందు విశ్వాన్ని సృష్టించి, తర్వాత "కొడుకుల్ని" సృష్టించి, తాము క్షేత్రాలుగా, కొడుకులు బీజాలుగా మానవ నిర్మాణం చేస్తారు.

'రాతి మనిషినే కానీ...!' (P. 119)

'మియా మల్హార్' వర్షాగమనరాగం. కానీ ఈ కవితలో అది శోక వర్షం. మైకేల్ జాక్సన్‌లో లాగా అబ్దుల్ కరీం ఖాన్ గొంతులోనూ కొంత స్త్రీత్వం. స్త్రీ రౌద్రంలో కొంత పురుషత్వం 'పటదీప' రాగంలోలాగా.

'కాల్ గాళ్' (P. 82)

నటాషియా కిన్‌స్కీ ' కాట్ పీపుల్ ' సినిమాలో నటి.

ఎల్లమ్మ దేవతది కూడ సృష్టి స్థితి లయన్యాయమే.

పసుపులేటి రచించిన నాటకం Ellamma అచ్చయిన తర్వాత ఓసారి తప్పక చదవండి.

'గ్రేట్ కన్ఫెషన్స్ ఆఫ్ వైల్డ్ గేమ్స్' (P. 74)

స్త్రీ పురుష సంబంధాలకు యాసిడ్ టెస్ట్‌లు. బొహీమియన్ జీవన విధానం.

శివుడి మీద తన్నడం= Kicking on the Ass

కన్ను = స్త్రీ జననాంగం

గరగర = లైంగిక వ్యాకోచం

కుందేటి కూన = బన్నీ, మంచి వక్షం ఉన్న కన్య

బుషే - Francois Boucher, 18th century French painter. 'The Triumph of Venus' చిత్ర కారుడు

'ఇన్‌ఫెంట్ హామ్లెట్' (P.89)

ఇంతకు ముందు చెప్పుకున్న విచిత్రమైన కొడుకు కథ, ఎల్లమ్మ ఇతివృత్తం ఇందులోనూ కన్పిస్తుంది.

'రెక్కల బాధ రెక్కలది' (P.112) కోర్బే (Gustave Courbet) చిత్రం "ది స్లీపర్స్" చూడ్డానికి బూతు బొమ్మలా కన్పిస్తుంది. లెస్బియనిజం ఇందులో చిత్రితం. పారిస్‌లో జీవించిన అమెరికన్ పెయింటర్ విజ్లర్ ప్రియురాలు జో హెఫర్నా (Jo Heffernan) ఈ చిత్రానికి మోడల్‌గా పనిచేసింది. ఆమె ఇంకా బాగా యౌవనంలో ఉన్నపుడు "సింఫనీ ఇన్ వైట్ - నంబర్ వన్" అనే చిత్రాన్ని విజ్లర్ చిత్రించాడు. కవి స్విన్ బర్న్ ఈమె మీద ఒక కవిత కూడా రాసాడు.

'యుద్ధమే పరమార్థం' (P. 49)

ఇటాలియన్ ఫ్యూచరిస్టులు 'జీవితంలో యుద్ధం అవసరం అనే నినాదాన్నిచ్చారు. వాళ్ళ కళారూపాల్లో ఆ భావాన్ని ప్రచారం చేసారు. వారిలో Filippo Tommaso Marinetti ఒకడు "ship yards blazing with violent electric moons" అన్నదతడే.

'ఇసుక సమాధి' (P. 53) The woman of Dune అనే ఒక జననీస్ చిత్రం ఈ కవితకు టేక్ ఆఫ్ పాయింట్.

'పెన్నీలేన్ రెవరీ' (P. 60) 70లలోని బీటిల్స్ ఉద్యమ ప్రభావం "కమ్ టు గెదర్", "లెటిట్ బి", "పెన్నీలేన్". గాయపడిన స్త్రీ ఆఖరి నడక.

'యాన్ ఎవర్ ఎలీనేటెడ్....' (P.102)

జాన్- లూహ్-గోదా (Jean-Luc-Godard) తీసిన "All Boys are called

Patrick" లోని ఎలీనేషన్ని ఈ కవితలో కూడా చూడొచ్చు.

'కామగానం' (P. 71) "The Triumph of Virtue" అన్న పెయింటింగ్ - Andreas Mantinia అన్న ఇటాలియన్ పెయింటర్‌ది. ఇతనిదే 'పార్నసస్' అనే మరొకటి. రెండు Louvre లో ఉన్నాయట. రెండింటిలోనూ ఒకే Theme. కామగానం. ఎల్లమ్మ తత్వమే మళ్ళీ.

'ఏడుగురందగత్తెల ప్రియుడు' (P. 141) పికాసో ప్రేమగాథలు.... తన డాన్సర్ భార్య ఓల్గా పికాసో పట్ల బ్రహ్మరాక్షసిగా మారిపోయిన నేపథ్యంలో పికాసో కసిగా వేసిన చిత్రం The Three Dancers. అలాగే మరొక దీర్ఘకాల ప్రేయసి జీలో (Gilot) వెళ్ళిపోగానే ఓ తొమ్మిది వారాలు తలుపులు వేసేసుకుని ఏకధాటిగా 180 బయోగ్రాఫికల్ డ్రాయింగ్స్ గీసాడు. అవన్నీ కన్ఫెషన్స్. పికాసోదే మరొక చిత్రం 'ది ఎంబ్రేస్' కూడ ఈ కవితకు ప్రేరణే.

'సెవెనియర్ ఇచ్' (P. 91)

Billy Wilder 's 'Seven year Itch'

'బర్త్ ఆఫ్ వీనస్' (P. 106)

రెండు చిత్రాలు - ఇటాలియన్ పెయింటర్ బొతిసెలీవి. అవి 'Peimavera', 'The Birth of Venus'. స్త్రీ సౌందర్యం గొప్ప సెన్స్యువస్‌గా చిత్రితం. వీనస్ పసిపిల్ల-బర్త్ ఆఫ్ వీనస్‌లో. కాని నిండు యౌవనవతి.

కవి తనను తాను Uranus గా ఊహించుకొంటున్నాడు. అపుడు మరి వీనస్ తనకు కూతురే అవుతుంది. కాని కూతురులోనూ కన్నమ్మను ఊహించుకొంటున్నాడు.

'పదాంగన్యాస' అనే ఓ తాంత్రిక సెక్స్యువల్ టెక్నిక్ కూడ సూచితం ఈ కవితతో.

'హాలో...! హాలా...!' (P. 121). హాలుడి గాథాసప్తశతి లోని మాఘమాసం గాథ ఆధారం

'సాదె' (P. 130) ఆఫ్రికన్ అమెరికన్ గాయకురాలు.

బాధ బాధే (P. 155) బీతొవెన్ 9th సింఫొనీ ఆధారం.

'తీగలెప్పుడూ చుట్టుకుంటాయిలేగాని ...!' (P. 152) చార్లీచాప్లిన్ విలన్‌గా నటించిన చలన చిత్రం 'Monsieus Verdoux' రిఫరెన్స్. గ్రీక్ గాడ్‌లాంటి అందగాడు మార్క్ హెర్మాన్ కి కూడ ఓ సూచన ఉందీ కవితలో.

'థాంక్యూ క్లిమ్‌ట్ ' (P. 136) గస్టావ్ క్లిమ్‌ట్ చిత్రించిన చిత్రం 'Judith'. ఓల్డ్ టెస్ట్‌మెంటులోని కథ. తన జాతి శత్రువు Holofernes అనబడిన అసీరియన్ కింగ్‌ని

చంపటానికి జూడిత్ తన శృంగారంతో అతడ్ని లోబర్చుకొని తర్వాత తల తెగవేస్తుంది. కాళికావతారంలా. కానీ క్లిమ్‌ట్ చిత్రించిన జూడిత్ చిత్రంలో - జూడిత్ ముఖం లైంగికానంద పారవశ్యంతో నిండి పోయి ఉంటుంది. కవి డెన్మార్క్‌లో ఉన్నపుడు తన గుర్విణి 'రొబర్తా కరెల్లీ' ఒక నాటకంలో జూడిత్‌గా నటించిందట !

## V

పసుపులేటి పూర్ణచంద్రరావు గారు కవిగా రంగ ప్రవేశం చేయటం ఇదే ప్రథమం గానీ నాటక రచయితగా ప్రయోక్తగా రంగస్థల నిర్దేశకుడిగా, నాటక కళా విమర్శకుడిగా పరిశోధకుడిగా గత ఇరవై సంవత్సరాల నుండి ప్రసిద్ధులే.

బాదల్ సర్కార్ శిష్యుడిగా 'Third Theatre' ని గురించి ప్రథమ పాఠాలు నేర్చుకొన్నారు. (1982-83)

1984 లో చుక్కసత్తయ్య అనే జానపద కళాకారుడినుంచి 'ఒగ్గు కథ' ఉగ్గు పాలు త్రాగారు. బ్రెష్ట్ పరాయికరణ సిద్ధాంతంకీ ఒగ్గు కథకీ ఉన్న సామ్యాలు కూడా గ్రహించారు.

బ్రెజిల్ నాటక రంగ సిద్ధాంత కర్త ఆగస్టో బోవాల్ వద్ద 1992 లో పారిస్ లో కొన్ని పాఠాలు నేర్చుకొన్నారు.

మరొక రెండు సంవత్సరాల తర్వాత డెన్మార్క్‌లో యూజినియో బార్బ దగ్గర శిష్యరికం.

విద్యాభోధనలో నాటక రంగం అనే విషయం మీద బర్మింగ్ హోమ్‌లోని యూనివర్సిటీ ఆఫ్ సెంట్రల్ ఇంగ్లండ్ లో హాజరు. (1996)

ఈయన తన శైలిగా అభివర్ణించుకొనేది - Victims Theatre. ఈ పద్ధతిలో శిక్షణ పొందిన నటులెవరూ ఉండరు. భాధితులే పాత్రధారులు. వాళ్ళ సమస్యలే నాటక ఇతివృత్తాలు. రైతులు, ఆదివాసులు, కట్టు బానిసలు, రిక్షావాళ్ళు, చేనేత కార్మికులు, గ్రామీణ బాల, స్త్రీ కార్మికులూ వాళ్ళ వాళ్ళ గొంతులు విప్పుతారన్నమాట.

ఈయన స్థాపించిన సంస్థపేరు Ethnic Arts Centre (1990) పారిస్, యు.కె., హంగరీలలోని నాటక సంస్థలలో సభ్యత్వం ఉంది. యునెస్కో యొక్క International Theatre Institute లోని Indian సభ్యులలో ఒకడు. మనీలా, పారిస్, బాంగ్‌కాక్, డెన్మార్క్, రోమ్, హాంగ్ కాంగ్, ఎక్సెటర్, బ్రిస్ బేన్, బెర్గన్ లలో జరిగిన అంతర్జాతీయ సదస్సులలో ఉపన్యసించటం, పత్ర సమర్పణచేయటం జరిగింది.

"మన్నెంలో", " సిటికెడంత సదువు", "మమ్మల్ని బ్రతకనివ్వండి" ఈయన తెలుగు

నాటకాల్లో ముఖ్యమైనవి.

చిత్తూరు జిల్లా అంతటా 400 బృందాలతో సంపూర్ణ అక్షరాస్యతపై పదివేల ప్రదర్శనలు! ' ఔరత్ ' అనే ఉర్దూనాటకం ద్వారా మురికి వాడల్లో మహిళల జీవనాన్ని చిత్రిస్తూ హైదరాబాద్‌లోని మురికి వాడల్లోనే 196 ప్రదర్శనలు!

ఎల్లమ్మ గాథ మీద గొప్ప ఆరాధన. గ్రామీణ దేవతల మీద ప్రత్యేక పరిశోధనాభినివేశం. దేవదాసి నృత్యరీతులపై పరిశోధక ఆసక్తి.

ప్రచురితం కావల్సిన ఆంగ్ల నాటకాలు మూడు : ఎల్లమ్మ; ది మూన్ అండ్ ది లోటస్ ; ది పిట్.

## VI

'ఇంత తెలిసి యుండి ఈ గుణమేలర' అంటారు కదా మరి!

అటు ఆత్మజ్ఞానమూ లేక ఇటు ప్రపంచ జ్ఞానమూ లేక నేటి తెలుగు కవి తెల్లబోతున్నాడు, తిరగక చెడ్డాడు. తెలుగు కవికి ఉన్న అనుభూతి కొంచెమే. అనుభవాలూ లేవసలు. ఎంతకూ సమూహపు అలజడి తప్పితే కాస్తంత ఆత్మ ఆవిష్కారానికి లోనవడు. ఇప్పటికీ ఆ అమలిన శృంగారాన్నించి బయట పడలేదు. లైంగిక అనుభవ వ్యక్తీకరణ ఇప్పటికీ ఒక బూతు మాటే. అదంతా - నీకంటే నేను పవిత్రుడ్నని చెప్పుకొనే ఒకానొక దొంగ నీతి ప్రవచనం.

స్త్రీకి ఒక స్వీయ వ్యక్తిత్వాన్నిచ్చిన కవితలే ఈ సంకలనం లోనివి. స్త్రీ ఒక Vassal కాదు, Vessel కాదు అని నిరూపించినవే ఈ కవితలన్నీ. స్త్రీ శక్తి స్వరూపిణి అని దివ్యత్వానికి పెంచాడే గాని అవమానించలేదు. ఈ సంకలనంలోని "ఛిన మస్తాదేవి" కవిత చదవండి. ఆమె తాంత్రిక శక్తికి ఎలా జోహార్లర్పించాడో గమనించండి.

"Chinna masta is probably the most dramatic, stunning representation in the Hindu pantheon of the truth that life, sex and death are part of an interdependent, unified system... the gruesome decapitation, the copulating couple, the cremation ground, all arranged in a quite delicate, harmonious pattern - jolt the viewer into an awareness of the truth that life feeds on death, is nourished by death, necessitates death, and that the ultimate destiny of sex is to perpetuate more life, which in turn will decay

and die in order to feed more life".

('Hindu Goddesses' by a David kinsley. P. 173)

ఆధునిక పురుషుడు ఆధునిక స్త్రీచేత మహిషాసుర మర్దనం చేయబడతాడనే చెప్తున్నాడు కవి. పురుషుడ్ని గొప్ప చేయటం లేదెక్కడా. గొప్పకుపోతే ఆ దుర్గతే పడ్తుందని హెచ్చరిస్తోన్నాడు కూడ ! ఆధునిక స్త్రీ ఈ కవికి మహీధరిగా, జగద్ధారిగా, శతాక్షిగా, ప్రణదగా, అపరాజితగా, చాముండిగా, ప్రాణరూపిణిగా, శక్తి స్వరూపిణిగా, కాళికగా, ఓజోవతిగానే సాక్షాత్కరిస్తోంది. ఒకసారంటూ మాతంగిని అయిందా స్త్రీ ఇక అక్కడ్నించి తనను మాతంగిని చేసిన పురుష స్వామ్యాన్నే తలకిందులు చేసేస్తుంది తన బూతుల్తో, తన చిందుల్తో. ఆధునిక స్త్రీకి పవిత్రతా ప్రతీక కన్యాకుమారి మాత్రం కాదు. శక్తిలో మాత్రం కన్యాకుమారినే మించి పోగలదు.

ఆధునిక తెలుగు కవిత్వంలో ' లెట్ మి కన్ఫెస్ ' మొట్టమొదటి వామాచార కవితగా కన్పిస్తూంది. నవరసాలలో ఒక దాన్నుంచి మరొక రసం ప్రవహిస్తూ బీభత్స భయ విభ్రమాల్లోంచి ఒకానొక అనంత శాంత ఆశ్చర్య ప్రశాంతిలోకి ఒదిగి పోతుంది ఇలాంటి అంతిమ కవిత.

- 3 -

25-8-2002